# పునర్జన్మ విచారము



గ్రంథకర్త:
పల్లెల కోటిలింగం



1972

వెల: 1-50

2

శ్రీ గురువేనమః

శ్రీ మత్పరశురామ సీతారామస్వాములవారి ప్రియశిష్యుడు

# శ్రీమద్భాగవతకృష్ణదేశిక ప్రభువులవారు



శక్తిద్వయ నిరాసకంబైన శుద్ధ నిర్గుణ తత్వకందార్థ
కంద పద్యముల గ్రంథకర్త

శ్రీగురవేనమః

శ్రీ మద్భాగవత కృష్ణదేశిక ప్రభువులవారి ప్రియశిష్యుడు

# శ్రీమత్పిల్లాన లక్ష్మణదేశిక ప్రభువులవారు



శ్రీ గురవేనమః

శ్రీ నిత్యానంద కొండోజు సీతయార్యదేశికుల వారి ప్రియశిష్యుడు

## అష్టతను నిరసనానంద
## శ్రీ పల్లెల కోటిలింగంగారు



గ్రంథకర్త

5

శ్రీ గురువేనమః

శ్రీమత్పిల్లాన లక్ష్మణదేశిక ప్రభువులవారి ప్రియశిష్యుడు



శ్రీనిత్యానంద కొండోజు సీతయార్య

దేశికులవారు

6

శ్రీ గురువేనమః

శ్రీ మత్పిల్లాన లక్ష్మణదేశిక ప్రభువులవారి ప్రియ శిష్యురాలు

# శ్రీమతి కొండోజు ఈశ్వరమ్మగారు



మరియు శ్రీ నిత్యానంద కొందోజు సీతయార్యదేశికులవారి

ధర్మపత్నిగారు

ఈగ్రంథమునకు ద్రవ్య సహాయకురాలు

శ్రీ గురవేనమః

శ్రీ నిత్యానంద కొండోజు సీతయార్య దేశికులవారి ప్రియశిష్యుడు
మరియు కొమారుడగు



# శ్రీ కొండోజు బ్రహ్మానందంగారు

2)

# అంకితము

శ్రీ నిత్యానంద కొండోజు సీతయార్య దేశికేంద్రులవారి ప్రియశిష్యుడ నగు నేను నాయొక్క గురుకృపచే, అచల సాంప్రదాయక భ్రాంతి రహితులగు పెద్దల అనుభవములను గ్రహించి నాచే, వ్రాయబడిన "పునర్ జన్మ విచారము" అనే గ్రంధమును వ్రాసి నాగురువుగారి ధర్మపత్నియగు శ్రీ మతి కొండోజు ఈశ్వరమ్మగారి ద్రవ్యసహాయముచే ఈ గ్రంధమును అచ్చువేయించి నా గురువుగారియొక్క ప్రధమ కొమారుడు, మరియు ప్రియ శిష్యుడగు శ్రీ కొండోజు బ్రహ్మనందా చార్యులను ఆశ్వీరదించి ఈగ్రంధమును శ్రీవారి ద్వితీయ ఆరాధనపూజలో (19-10-72) రోజున భక్త బృందము సమక్షమున అర్పించితిని.

ఈ అచల సాంప్రదాయ సిద్ధాంతములను, మరియు ఈ గ్రంధముద్వారా ప్రజలను భ్రాంతిరహితులుగా చేయగలరని ఆశించుచున్నాను.

ఇట్లు
పల్లెల కోటిలింగంగారు
గ్రంధకర్త

అచల సాంప్రదాయకులైన భ్రాంతి రహితులైన శ్రీ నిత్యానంద కొండోజు సీతయార్యదేశికేంద్రులవారి ధర్మపత్ని మరియు నాతల్లిగారగు శ్రీమతి కొండోజు ఈశ్వరమ్మగారు, వారి ప్రియ శిష్యుడైన శ్రీ వల్లెల కోటిలింగంగారు కృషిచేసి, గురుభక్తితో వ్రాసిన "పునర్జన్మ విచారము" అనే గ్రంధము ప్రజల బంధ విమోచనకై చేసిన గ్రంధమును ప్రజల అందుబాటులో యుండుటకై ద్రవ్యసహాయము చేసి ఈ గ్రంధము అచ్చు వేయించినందులకు నాయొక్క మరియు భక్తమండలివారి యొక్క కృతజ్ఞతలు ఈ తల్లిగారికి తెలుపుచున్నాము.

ఇట్లు
శ్రీవారి పాదధూళి
కొండోజు బ్రహ్మానందం

ఇం. నెం. 11-4-321
చిలుకలగూడ, సికింద్రాబాద్.

అచల సాంప్రదాయకులైన, భ్రాంతి రహితులైన శ్రీనిత్యానంద కొండోజు సీతయార్య దేశికేంద్రులవారి ప్రియశిష్యుడు శ్రీ పల్లెల కోటిలింగంగారు సుమారు 60 సంవత్సరములనుండి, గురు సేవలోయుండి, గురుగురు బోధలను సేవించి, విమర్శించి, అనేక పెద్దల గ్రంథములయొక్క సారములను గ్రహించి మానవుల క్షేమమునకై పరిపూర్ణఅచలసిద్ధాంత భావముచె "పునర్జన్మ విచారము" అను గ్రంథమువ్రాసి వారిగురువుగారి యొక్క కొమారుడనగు నాకు ఈ గ్రంథమును శ్రీవారి ద్వితీయ ఆరాధన పూజలో అనగా (ది. 19-10-1972) రోజున భక్తబృందము సమక్షమున అర్పించినందులకు నాయొక్క కృతజ్ఞతలు తెలుపుచున్నాను. మరియు మాభక్తమండలినుండికూడ కృతజ్ఞతలు తెలుపుచున్నాను.

ఇట్లు
శ్రీవారిపాదరేణువు
కొండోజు బ్రహ్మానందం

ఇం. నెం. 11-4-321
చిలుకలగూడ
సికింద్రాబాదు.

# గ్రంధ పరిచయము

శ్రీ గురుంనమః

శ్లో॥ నభూమి నచలంచైవ నతేజో నచవాయమః
నచంబ్రహ్మ నచంవిష్ణు నచం నక్షత్రతారకం
సర్వశూన్య నిరాలంబం స్వయంభూః విశ్వకర్మణః

పంచభూతములకు మొదలు త్రిమూర్తులకు మొదలు సృష్టికి మొదలు నిర్గుణ నిరాకార పరిపూర్ణ పరబ్రహ్మయందు, అవ్యక్త రూపమున మూలములేక, తనంతటతానే చలన రహిత పోలికగల విశ్వబ్రహ్మ స్వరూపునిగా వచ్చి త్రిగుణాత్మకముచే విశ్వకర్మ స్వరూపమున, సర్వ ప్రపంచమునకు, సృష్టిరూపుడై, సకలచరా చరములకు. ఆధారుడై తనమాయాశక్తిచే సకల ప్రపంచమును ధర్మాధర్మములచే పోషించుచుండెను.

విశ్వబ్రహ్మ స్వరూపుని త్రిగుణరహితముచే మానవులు తెలుసుకొనడమే గాక అట్టి బ్రహ్మ స్వరూపుడు చలన రహిత మైన నిండి నిమిడియున్న పరిపూర్ణ పరబ్రహ్మమే విశేషమని గ్రహించడమే మానవుల కర్తవ్యమని, సాధులు, జ్ఞానులు, ఋషులు గురువులు బోధించిరి.

కొంతకాలము తరువాత మానవులయందు స్వార్థబుద్ధియేచ్చి అభిమానములతో వారివారికి అనుకూలమైన మతములను ఏర్పరచు

కొని గురువుల పేర్లతో పూజ్యులమని మత పెద్దలమని అమాయక ప్రజలలో కల్లోలములు లేపి, ఆశలు పెట్టి, అనేక కట్టు దిట్టములను జూపి పాపపుణ్యముల పేర్లతో పునరన్మలు కలవని, ప్రజలను దోచుకొనుచు, అనేకమైన శ్రమలపాలు చేయుచునుండిరి.

ఉత్తమ పురుషులు, స్వార్ధరహితులు, అచల సాంప్రదాయులు, మరియు శ్రీశివరామ దీక్షితీయులు శ్రీ భాగవత కృష్ణదేశిక ప్రభువులు శ్రీపీల్లాన లక్ష్మణ దేశిక ప్రభువులు శ్రీ నిత్యానంద కొండోజు సీతయార్య దేశికేంద్రులు, ఈజగతిలో మతముల పేరిట జరుగుచున్న ఘోర నరకములను జూచి, సహించక భ్రాంతీ రహితమైన పరిపూర్ణ అచలబోధచే జనులను మేలుకొలిపినారు. శ్రీ కొండోజు సీతయార్యుల ప్రియశిష్యుడైన అష్టలను నిరసనానంద పల్లెలకోటి లింగంగారుపై పెద్దలుచెప్పిన భావమునే మరియు గురుగురు బోదలచే గ్రహించిన అనుభవమునే "పునర్ జన్మ విచారము"అనే గ్రంధరూపేనవారి అభిప్రాయములను సకల జనులకు తెలియునట్లుగా బయలుపరచినారు.

సృష్టిస్వభావికము లో ప్రతి జీవికి పునర్ జన్మలేదని పలికినారు. అది ఎట్లనగా, తననుండి వెలువడిన పలుకులు, మళ్లీ తనయందు చేరనట్లుగా, చనిపోయిన మానవుడు మళ్లీ వారేరావడానికి ఆస్పదము లేదని ఘంటాపదముగా తెలపినాడు.

తలిదండ్రులవల్ల (యిద్దరివల్ల) కలిగినపదిమంది సంతానము వారు ఇద్దరు యున్నపుడే యిన్నిరూపములుగామారి నప్పుడు

వారుచనిపోయిన తరువాత వారే మల్లి పుట్టుదురన్నమాట వట్టి బూటకములని సెలవిచ్చినారు. అట్లువచ్చినచో, వారివారి పూర్వపు జన్మలగుర్తులు, వారివారికితెలిసియుండేవి. అట్లు తెలసినట్లు ఈ పృధివిలో ఎవ్వరిగుర్తుకురాలేదు, వారివారి కార్యములు జరుపు కొనుచు వారు పోవడమె సృష్టియొక్క స్వభావిము. జగత్తును, సృష్టి కర్తయగు విశ్వకర్మయందు పుట్టించె శక్తియున్నపుడు, చనిపోయిన వారినే పుట్టించవలసిన పనియేమున్నది. ఒక వేళ చనిపోయిన వారే మల్లి పుట్టినట్లయితే సృష్టికర్తయుండేఅవుసరమే లేదు అందరును సృష్టికర్తలే అవుదురు. ఒక జొన్నగింజను వడ్లగింజగా మార్చుచేసే శక్తి మానవునియందులేనప్పుడు, సృష్టి స్వభావికములోనే లేని పునర్జన్మను, కట్టుకదలచే పునర్జన్మలు కలవని ప్రజలకు బోధించి స్వార్థము వదలనిగురువుల వలుకులు సత్యమగునా?

సృష్టి స్వబావికములోనే పునర్జన్మలు లేవని గుర్తెరిగి ప్రజలకు గల భయభ్రాంతులను లేకుండగ జేయడమే ఉత్తమ గురువులయొక్క లక్షణము.

ఇట్లు గల సృష్టి స్వబావికము యిట్లు యుండగా, కొందరు స్వార్థులు, గురువులమని మతపెద్దలమని, వారివారి అనుకూలమైన మతముల పేరట ప్రజలను ఆశలనే కోరికలచే, తాళ్ళచే బంధించి నారు. అట్టితాళ్ళచే బంధింపబడిన ప్రజలను, స్వార్థరహితులైన సాధులు చలన రహితులైన గురువుల భావములచే ఈ గ్రంధ

కర్త "పునర్జన్మవిచారము" అనే గ్రంథములో ప్రజలకు గల బంధములను యిప్పినాడు. దీనికి ఒక ప్రత్యక్ష వుదారణమేమనగా ఒకవడ్లగింజ అనేక వందలగింజలను సృష్టించి, ఆ మొదటి గింజ నశించి మళ్లి అదేవడ్లగింజ పుట్టి పెరగనట్లుగా, మానవులు పుట్టి,వారి వారి కార్యములను స్వార్థబుద్ధులులేక ధర్మాధర్మములు గుర్తెరిగి పోవడమే వారి వారి సృష్టిస్వభావికములు గాని, చనిపోయినవారే మళ్ళీపుట్టుదురన్న పలుకులు సత్యములుకావు. ఇట్టి బంధ విమోచనముకొరకై, నిర్గుణమై అచల పరబ్రహ్మమును, గుర్తెరిగిన స్వార్థరహితుల దరిచేరినచో బంధ విముక్తులు కాగలరని ఈగ్రంథకర్త అభిప్రాయము. మరియొక విశేషమేమనగా, విశ్వకర్మ సృష్టి స్వభావికములో ప్రతి చరాచరజీవులకు, మరిశ్రేష్టమైన మానవజీవులకు, ఆకలినిద్ర, మైదనము, ఆశ, కోరిక, మరణము వాటి వుత్పత్తిలోనే కలగినవి యిట్టి స్వభావికముతో యున్నటువంటి వాటిని జయించుటకుగాను వారివారి జీవితవ్యవధిలోనే స్వార్థ బుద్ధులను వదలి, సర్వమానవులను సమాన దృష్టితో చూచి, దేశభక్తితోయుండి, ధర్మాధర్మములను పాటించి వుత్తమ జీవితములను గడుపుచు, స్వార్థరహితుల సాంగత్యము చేయుచు, సగుణపోలికగల అవ్యక్త విశ్వబ్రహ్మ స్వరూపుని జ్ఞానదృష్టితో గని చలన రహితస్థితిలో సత్యమగు నిర్గుణ, నిరాకార పరిపూర్ణపరబ్రహ్మమును పూహించడమే మానవజాతికే ఆనందము చేకూరును. ఈ విధముగా

గ్రహించని వారును. వారివారి సంతానము అధోగతి పాలగు దురని ఈ గ్రంథము యొక్క సారాంశము.

ఉత్తములుగా యుండి నీవుకాని దానిని ఉన్నది ఉన్నట్లుగా గ్రహించుటకు మతమతాంతముల సారాంశమును గ్రహించిన భ్రాంతి రహితులైన అచల పరిపూర్ణ గురువులదరి చేరడమే మానవుల కర్తవ్యమని ఈ గ్రంధకర్త సూచన,

ఈ గ్రంధము అచ్చువేయుటకు, భక్త బృందము మరియు ప్రేమీయులు తోడు పడినందులకు నా కృతజ్ఞతలు తెలుపు చున్నాను.

ఇట్లు
కొండోజు బ్రహ్మానందం

# పునర్జన్మ విచారము

## విచార ప్రయోజనము

## ఉపోద్ఘాతము

సంపత్ కరమైన సృష్టిస్వరూపములందు జనులను గను గొని గుర్తెరిగినదేమనగా నానామతములలో నానాభాషలచే నానా దేశములందున నానా వృత్తులచే జీవించనివారుండరు. సుఖ సంపదల లెప్పుడు కోరనివారుండరు. జీవిత వ్యవధిలో మోక్షము కోరని వారుండరు. ఈకోరికలను తీర్చెడు నానామతములలో బోధించెడు గురువులు లేకుండగ నుండరు. ఇందుకు ప్రత్యక్షము మరణించినవారికి జేసెడు కర్మలే తార్కాణము. ఇట్లువిడువక కర్మలు జేసెడు వారందరు బ్రహ్మమునే నని భావించెడు జ్ఞానులు మహాభూతములాకారముగల జగమును అసత్యమందురు. మరి కొందరు చలన తహితమగు పరిపూర్ణము నందున జగమేలేదని మోక్షముకోరెడు కర్మలు విడువరు మరికొందరు ఏ గురువులు జూచెరుగని పరలోకము సత్యవైకుంఠ కైలాసములను గలవని విను జనులందరు జగమును మిథ్యందురు. ఇక తమ తమ సంతా నము జీవించెడు సంపదగల జగమును అశాశ్వత మందురు. వీరుండగ అశాశశ్వత జగమును వీరెరుగరు. మరణముతరువాతను జగమేమైనది తానెందున్నది ఎవరును చెప్పరు. వారును వచ్చెరి గించరు. మాకిక జన్మము లేదని వాదింతురు. వీరెనుకటి జన్మము

వీరెరుగరు. ఇక గర్భములో శిశువై పెరిగెడు వరకును కలిగిన జ్ఞానము ఎవరెరుగరు. ఇక మరణము తరువాతను వెనుకటి పాప ముచే పుట్టితిమవి పుట్టినవారెరుగరు. ఇకపుట్టెదరని గురువులు ఎట్లెరుగును. ఇక సుఖముగ జీవించెడు దెరిగిన నానామత గురు వులందరి జనులందరు గుర్తెరిగిన దేమిటి ? ఇక మతభేదములను పాటించిన కుటుంబములు వేరై పోయెనుగదా ! మతములలో మత ములు ఏర్పరచిరి. శాస్త్రము ఒకటని జూపిరి పరమతములపాలైరి. గురువుల నమ్మిన జనులకు పట్టిన గతియిది. ఇక ఇంతకు పరమాత్ముడు ఎట్లున్నది గనుగొని చెప్పెరుగరు. జనులందరు ఒకటగు నట్లుగ దేశమునకు జేసిన సేవ ఎవరెరుగరుగదా ! మత గురువుల దరి విను జనులందరు సాధించిన విశేషమేమిటి ?

మరికొన్ని సంశయములను గుర్తుకు తెత్తును ఈశ్వర సృష్టిలో పుట్టినవారికి పుట్టెడు స్వభావముండగ పుట్టేపుట్టుగ తప్పిం పను వీలగునా ? స్త్రీపురుషుల కార్యముననను పుట్టి మరిగిట్టి మరల స్త్రీపురుషుల కార్యములేకను తనకై తాపుట్టి మరి సంతానము పుట్టించను జీవుడు హేతువుకాగలడా ! వృద్ధునిలో జీవుడు యవ్వ నముతేగలడా ! తనువున పెరిగెడు గోర్లు, వెంట్రుకలు పెరిగెడు కార్యము కాకుండగా జేసెడు క్రియ జీవునితో కాగలదా? మరియు జీవుడు పదార్థమా? లేక చైతన్యమా? మరి ఉపాది విడిచిన జీవుడు కార్యమునకు హేతువుకాగలడా ? తనువును విడచిన జీవుడు మరలే విధమున జన్మకు వచ్చును. ఇకనానామత గురువులలో బోధలు విను జనులందరు స్వజాతి జనులని ఎరిగెడు భాగ్యము ఏనాడిందుమోగదా ! మరియువెనుకటి జన్మము ఎరుగక పుట్టిన

జనులందున వృద్ధిగన్న గురువులదరి బోధించిన బోదను విని సాధించిన శిష్యులు పుట్టరు మీరని చెప్పినదిని ఎట్లొప్పిరి ఈ జనులందరు ? మరియు పొందపులేమిచ్చిరి రాజ్యాధికారము గెలిపించిన భగవానునికి ? తను మన ధనమిచ్చిన శిష్యులకేమిచ్చిరి సద్గురువులు ? ఇక ఈశ్వరసృష్టిలో కర్మకుతగు జీవులు నానా జన్మలలో పుట్టుట స్వభావమా ? ఆగంతుకమా ? తము పుట్టుగ తామెరుగని వారినిగని వెనుకటి జన్మము లేకను ఎప్పటికిని పుట్టరు మీరీజన్మమునని, బాధలుగలకర్మలచే బోధించెను సద్గురువులు తమ వెనుకటి పుట్టుగ తామెరుగరుగదా ! ఇట్లుండెడు సంశయము లేకుండెడిదే. పునర్జన్మ విచారమునకు హేతువ.

శక్తిద్వయ నిరానకంబను క్షరాక్షరోపాది ద్వయ దోష రహితమగు, సత్యాన్వేషనా నిర్ధారులగు శ్రీ శివరామదీక్షితుల అచలగురు సాంప్రదాయకులగు శ్రీకృష్ణదేశిక ప్రభువరులు వీరి శిష్యులు శ్రీ లక్ష్మణార్యులు వీరి శిష్యులు శ్రీ శీతయార్యులు గురు కరుణచే గనపరచిన సాధనగని జూచెరిగినివించెడు చలన సహితమగు బ్రహ్మమునందున లేకను తోచిన కలిగగపడు బ్రమవిడిచెడు మార్గము వింటిని. గురువులదరి ఎరిగిన జన్మకు హేతువ బ్రిమకారణ మయ్యెనుగద, సృష్ఠంతయు ఈశ్వర బ్రిమతో ఎట్లొచ్చెను ? ఇట్లుండెడు సంశయములు కొన్నింటిని పెద్దల ముందర గుర్తుకుతెత్తును. ఇకగురువులదరి గుర్తించినజనులందరు. మరిపుట్టరు. ఈశ్వర సన్నిధినైనను నుండేరందురు, ఇక ఏమెరుగని అమాయక ప్రజలు సంసారపుబాదలచే మరణించినవారేమగు

దురో ఏమైపుట్టెదరో ఎవరెరుగరు. ఇక ఈశ్వర సంకల్పమునను పుట్టినవారికి పుట్టుచునుండగ తను విడచిన జీవుడు ప్రజలను సృష్టించుటకై మరి పుట్టెడు కార్యముకలదా? తనపాపము పుణ్యము తనకారణమున ఏర్పడుకార్యమునను కలిగిన పునర్జన్మ కలిగిన కొడుకై పుట్టెనుగద "ఆత్మవై పుత్రానామాశీత్" న్యాయము కలదు గద. ఇక పరమాత్ముని సాధించెరిగిన గురువులు శిష్యులు మత జాతుల బేధములిడువక నేనని నీవని బేధములిడువక వాదించెడు నానా మతములలో నిజమెరిగెడు మతమేదని గుర్తింతుము. మరియు పుట్టేవారగ పడుచుండగ మరణించినవారిని చూచుచుండగ మరణించిన గురువులు శిష్యులు పుట్టనివారని ఏ విధముగ స్థిర మెప్పుడు అస్థిరమగునా? అస్థిరమెప్పుడు స్థిరమగునా? విషము తెలసితాగినను తెలియక త్రాగినను మరణించక తప్పదుగదా! అట్లు కారణమగు ఈశ్వర సంకల్ప కార్యముగల జగమున పుట్టిన నరులెవ్వరు వారెనకటి సంసారము ఎరిగే నరులును పుట్టరుగదా? ఇక గురువులు శిష్యులు మరణము తరువాతను పుట్టనిది పుట్టినది పుట్టినవారెరిగించరుగదా! ఇక గురువులదరి ఎరిగిన విశేశమేమిటి?

ఇక, సుషుప్తినుండెడువాడు మేల్కొనువాడని, మరణించిన వాడు మేల్కొనడని యెరిగిన విధమున జీవితమందున వచ్చే జన్మలో రాజై పుట్టేది లేక కుక్కై పుట్టేది చూచే ప్రత్యక్షము ఎవరెరుగరుగదా! ఇక మరణము తరువాతను పుట్టేవారందరు తమ వెనుకటి సంసారము ఎరిగెడు జ్ఞానముతో ఎవరును పుట్టరు గదా। ఇట్లగపడు సృష్టి స్వభావమునందున మరణము తరువాతను ఇక పుట్టుక లేదని తెలియుచునుండగా పుట్టెదరను భ్రమ పెట్టిన

నానామత గురువులదరి అభిమానించిన శిష్యులు గురువులు ఎరిగి ఎరిగించిన విశేషమేమిటి? ఇక దేశమునను సోదర జనులందరు సమిష్టినుండెడు మార్గము జేసెరుగరు. ఇక దేవుని ఏరిగింపైనను జనులందరు ఒకపై నుండెడు విధమును బోధించిన విధ మెరిగిన వారును కారు. లేక బహుమత గురువులు ఒకద్లై యుండెడు మార్గము కనుగొని బోధించినవారునుకారు. ఇక దేశమునందున జీవించెడు జనులకు గురువులు చేసినమేలేమిటి? ఇక ఈ సందేహములను నాగురు కరుణచే ఉన్నది ఉన్నట్లుగా పెద్దలగుర్తుకు తేనైనది. ఇందుకుతగు శ్రీ భాగవత కృష్ణదేశిక ప్రభువుల వాక్యములు గుర్తుకు తెత్తును. కందార్థము 106.

మతముల వారలు, తమ సమ్మతమైనటువంటి శాస్త్ర మర్యాదలచే, మితమేరు పరచుకొని, బహుగతులను, కలహింతు రట్టి గతీనీకేమిటీకి॥ చపలతజెందె స్థితినీకేమిటికీ॥ ప్రితిలేని ఈబట్ట బయలుండజూచి, సంతతము లేనెరుక లేరనినమ్మి మిక వారి గతినీ కేమిటికీ॥చపలతజెందె స్థితినీకేమిటికీ॥

మరియు కర్మములకు తగు జన్మములందున పుట్టినపుట్టుగ లిడువక పుట్టెరిగెడు ప్రారబ్ధము తప్పింపను ఎరుగని త్రిమూర్తులే అవతారము లెత్తుచునుండగా ఇక జన్మము తప్పింపను జనులెట్లెరు గుదురు? గురువులెట్లెరుగుదురు? అని ఒప్పించిన శాస్త్రజ్ఞులు అల్లిన సంశయ కథలనువిని ఒప్పిన జనులందరకును జన్మములేదని ఒప్పించిన ఋషి జన రచనములందున 'నిరాలంబో పనిషత్- అనంతోప నిషత్ శ్రీ మద్భాగవత కృష్ణదేశికుని కందా

ర్ధిములను వినగల బోధకు మూలముగల పెద్దల నడవడికను పాటించిన సాధులచే సంశయమిడిచెడు మార్గము గలదిందులో సాధించుము. ఇక గురుపుల సేవించిన వారికి మరిజన్మము లేదండురు గదా! తలిదండ్రుల కార్యమునను పుట్టిన జనులందరకును జన్మములేదండిని. ఇకనా మన ఏమనగా శాశ్వతమగు జీవునికిని దేవునికిని విడువని జన్మలు గలవని దృష్టాంతములచే వారిని ఎరిగించినచో జనులందరకును దృఢమగు నమ్మకమిడువక జేసిన వారగుదురు. ప మాత్మని సృష్టిలో పుట్టిన జనులందరురాగల మరణములోపల భార్యాబిడ్డల పోషించుటకై దనదాన్యము కోరని ఒనులుండరు- కోరిన కోరికనెరవేరుటకై పరమాత్మని ప్రార్థించని నరులుండరు జీవిత సుఖదుఃఖములందున విశేకెత్తిన సంసారులు మగలీ జన్మము ఒద్దని. దేవుని పార్థించని నరులుండరు-జీవిత మందున సుక సంపదకలుగుట మరుజన్మము రాకుండగ నుండుడ కోరెడు వరములు ఈ రెండును లభించు భాగ్యము పరమాత్ముని యందున కలదాలేదా- పునర్ జన్మవిచార మందున తెలిసెడు విశేషమిది.

మరియొక విశేష యేమనగా వెనుకటి జన్మమునందున జేసిన కర్మములేకను ఏ జనులును పుట్టరు. యిక పుట్టిన జనులందరు జీవితమందున జేసిన కర్మములకు నానాజన్మములందున పుట్టక తప్పదు జనులందరికని గురుపులు బోధించకమానరు.

యిట్లు బోదించిన గురువులందరి మతస్వీకారముచే శిష్యులు గను జేరిన లక్షలాది ప్రజలందరకును యిక నరకములేదని యిక

మోక్షము గలదని బహు విధశాస్త్రమర్యాదలచే జన్మము గలదని మొదలెరిగిన నరులె యిక మరివారికి జన్మములేదని విని ఆనందించిరి. ఆ నరులె యిందుకు సంశయమున పడవేయుట సంశయమును దీర్చుట ఈ రెంటికి హేతువ. ఎవరందురు యిందున తెలిసెడు ప్రత్యేక్షము జీవితమందున ఎరిగెదరా మరణము తరువా తెరిగెదరా.

జనులందరు జీవించెడు సృష్టంతటికిని క్రమమిడువక జరిపెడు కర్మకు మూలము వ్యక్తముగాకుండెడు పరమాత్ముడు లేడని చెప్పిన జనులొప్పెదరా లేక సృష్టంతట నిండుండిన పరమాత్ముడు జనులందున లేదని చెప్పినచో అందుకు జనులందరు ఒప్పెదరా ? అంతట నుండిన పరమాత్ముడు జనులందరి యందున పుట్టుట మరణించుట సుక దుఃఖములకు హెతువ పరమాత్మని చెప్పిన జనులొప్పెదరా ? యిక పరమాత్మను రెండుగ విడదీసి ఈ రెండెన్నడు కలయిక నుండేడు విధమున ఈశ్వర జీవులుగను, ఎర్పరచి విడువని ప్రారబ్దముచే నానా జన్మలలో పుట్టే జీవునిగను పరమాత్మను చిత్రించిరి యిందుకు జనులందరు విని ఏమందురు యిక సృష్టికి మూలమునకు కలిగిన బ్రమచే పుట్టిన తలిదండ్రుల యింద్రియ తనువున వ్యాపకమగు పరమాత్ముడు తను విడచిన తరువాతను జీవుడు అనబడు స్వరూపము ఏమగును.

ఎవ్వరికి జన్మము లేదని చెప్పినవిని, యిక గురువులు శిష్యులు ఎందులకని జనులందురు. స్పష్టెరిగిన గురువులందరి

శిష్యులు లేకను మత బేధములందున అనుభవబేదము ఏవిధమున తెలియును.

తమతమ మతములు విడువని గురువుల రహస్యము పరిపూర్ణ అచల ౹బాంతి రహితులదరిచేరక నిజమెటులెరుగుదురు. కర్మము తప్పించుటకే కదా సకలశాస్త్రములు, ౹పవక్తలు, కలిగిరి. మతబేదములు యెన్నియున్నను కోట్లాది ప్రజలకు మోక్షము అందరికి ఒకటిగ నుండునుగదా! యిక జన్మము కలుగనివారిందె వరందురు,

ఇట్లు
వల్లెల కోటిలింగం
గ్రంథకర్త

ఓం

శ్రీ లక్ష్మణార్య గురువేనమః

# శ్రీ శివరామ దీక్షితాచల గురుపీఠ అనుష్ఠానవిధిః

గురుర్ బ్రిహ్మా । గురూర్ విష్ణూ । గురుర్దేవో మహేశ్వరా ।
గురు సాక్షా । త్పరబ్రిహ్మ । తస్మై శ్రీ గురువేనమః

## గురు పరంపరా ధ్యానం

ఓం నమో బ్రిహ్మాదిభ్యో, బ్రిహ్మవిద్య సాంప్రదా యక ర్తృభ్యో, వంశ రుషిభ్యో, నమో గురుభ్యః॥ సర్వోపప్లవ రహిత ప్రజాన ఘన ప్రత్యగర్థో బ్రిహ్మై వాహమస్మి అహం పదార్థ రహితః

(శ్రీమహావిష్ణు సాంప్రదాయం)

శ్లో॥ శ్రీబ్రహ్మవిద్యా । గురు విష్ణు సూర్యం
శ్రీయాజ్ఞ వల్క్యం । జనకం శుకంచ
సాందీప మీశం । కృష్ణంచ అర్జునం
వందే గురున్మే । గురు పాదు కాంతం ॥

(శ్రీ శివరామ దీక్షిత సాంప్రిదాయం)

శ్లో॥ శ్రీధర స్వామినం నిత్యం । బోధకారణ మవ్యయం
భావాతీతం మహం వందే । సుఖజ్ఞానైక నిర్మలం ॥

శ్లో॥ వందారు జన మందారం । వందేహం త న్నిరంతరం
రామడుగు వంశజం శుద్ధం । శివరామాఖ్య దీక్షితాం ।

శ్లో॥ యస్యబోధో దయాత్సర్వం । బ్రహ్మవేత్యన గమ్యతే
శివరామే విధిఖ్యాతం । తద్దైవ ముపాస్మహే ॥

శ్లో॥ కామాది రిపు హంతారం । కారుణ్యా మృతసాగరం
కంబాలూ ర్యప్పరావాభి । ధానం వందేద్య మద్గురుం ॥

శ్లో॥ శ్రీమత్పరశు రామాన్వ । యాబ్ధిచంద్ర మనోరమం
నిత్యానంద మహంవందే । సీతారామ గురుం పరం ॥

శ్లో॥ నిత్యంసాంద్ర కృపారసం విదిత । భావాభావ మత్యున్నతం
ద్వంద్వాతీత మమత్సర్వం పరమ । కల్యాణాత్మ తత్వంవిధుం
బ్రహ్మానంద మయం సుబోధ నిలయం । స్వానంద భావంసదా
శ్రీమద్భాగవతాన్వయాబ్ధి విలసత్ । శ్రీకృష్ణ చంద్రంభజే ॥

శ్లో॥ శ్రీవత్సగోత్ర కలశాంబుధి । పూర్ణచంద్రం
శ్రీకృష్ణపాద కమలామృత । పాన భృంగం
శ్రీపీలుఖాన వంశాంబుధి । రేవజాతం
శ్రీలక్ష్మణార్య మనిశం । స్వగురుం భజామి ॥

శ్లో॥ పరిపూర్ణ భావ సిద్ధాంతం । సన్మార్గంచ ప్రవర్తనం
నిత్యానంద కొండోజు । శీతయార్య గురుంభజే ॥

శ్లో॥ శ్రీసనాతనగోత్రకలశాంబుధిపూర్ణచంద్రం ।
శ్రీఫీలుఖాన లక్ష్మణగురుపాదకమలామృతపానభృంగం ।
శ్రీవిశ్వకర్మకులదీపకశాంతదయాసముద్రం ।
శ్రీసీతయాచార్యమనసాస్వగురుంభజామ్యహం ॥

శ్లో॥ అస్మద్గురు సమారంభాం । కృష్ణ సాందీప మధ్యమాం
శ్రీమహా విష్ణు పర్యంతాం । వందేగురు పరంపరమ్ ॥

## -: లఘు పూజా :-

### గురుధ్యానం

శ్లో॥ బ్రహ్మానందం పరమసుఖదం । కేవలం జ్ఞానమూర్తిం
ద్వంద్వాతీతం గగన సదృశం । తత్వమస్యాది లక్ష్యం
ఏకంనిత్యం విమల మచలం । సర్వధీ సాక్షిభూతం
భావాతీతం త్రిగుణ రహితం । సద్గురుం తన్నమామి ॥

శ్లో॥ ధ్యానమావాహనం సింహా । సనం పాద్యం తధైవచ
అర్ఘ్య మాచనీ య్యంచ । స్నానం పంచామృతైఃస్సహ ॥

శ్లో॥ శుద్ధోదకం వస్త్రయుగ్మం । యజ్ఞసూత్రం విభూషణం
విలేపనం చాక్షతాంచ । పుష్పంస్వర్ణ వినిర్మితం ॥

శ్లో॥ ధూపం దీపంచ నైవేద్య । పానీయం ఫలమేవచ
తాంబూలం దక్షిణార్ధిక్యం । మంత్ర పుష్పం ప్రదక్షణం ॥

శ్లో॥ నమస్కారం దేశికేంద్ర । మయాతుభ్యం నివేదయేత్
కృపయా గృహ్యతాం స్వామిన్ । న్యూనాధిక్యంనచింతయా॥

శ్లో॥ లఘుపూజా విధింభాగ । వతకృష్ణ ద్విజన్మనా
రచితం శ్రోత్రు వక్తూణా । మిదంమోక్షకరం పరం॥

ఇతి శ్రీమద్భాగవత కృష్ణదేశిక ప్రభు విరచిత
లఘుపూజా విధానం సమాప్తం.

---

ఓం

### -(గురుపూజా విధానం)-

శ్లో॥ శ్రీమద్దేశిక నిర్మలం నిజగురుం । నిష్కామ నిర్ద్వంద్వకం
నిస్సంగం నిరపేక్ష మవ్యయమమలం । నిర్భేద్య నిర్మూలనం

నిత్యానిత్య వివేక నిరుపమ పదం। నిర్నామ నిర్లేపకం
శ్రీపీఠాన సువంశ వారధి విధు। లక్ష్మణార్యం భజే ॥

శ్లో॥ హృత్పుండరీక మధ్యస్థం। సకలామ్నాయ సంస్తుతం
ధ్యాయామ్యహం సదాభక్త్యా। సకలాభీష్టదాయకం ॥

కందార్థములు

కం॥ నిరుపమ నిర్గుణ నిశ్చల - పరిపూర్ణ అనంతనిత్య - పంచాతీతా - పరమపద కేవలాత్మా - దురహంకృతి హరణసర్వా దర్వ॥ దోషావిదూరా సద్గురవేస - ర్వేషారావేరా - కరుణాతో భక్తులను కడతేర్చి రక్షించే - దొరవాని మాహృదయ - విరిలోన నమ్మీతి ॥ దోషావిదూరా — సద్గురవే సర్వేషా రావేరా॥ శ్రీనిత్యానంద సీతయార్యదేశికేంద్రా రాజయోగిస్వగురు పరమగురు పరమేష్టిగురు సద్గురు నిజగురు పరబ్రహ్మణేన్నమః ధ్యాయామి.

( ధ్యానం సమర్పయామి )

శ్లో॥ అగచ్ఛానంద దేవేశ। భోగమోక్ష ప్రదాయకః
నాకేశ ముఖలోకేశ। వందితాంఘ్రి ద్వయాంబుజ ॥

కం॥ సరసిజ గర్భాదులు మిము - స్మరియించిన మోక్ష మొసగి - సంతస మొప్పగ - ధరలోన బోధించినాడవు - కరుణాకర భక్తవరుల ॥ ద ॥ గావూ సర్వేషా - యిందున నిల్వా -రావే యఘశోషా - పరిపారి విధమూల - ప్రస్తూతి జేసియు - మురసీ ఆవాహనమును ఇదె గైకొనియు - గావూ సర్వేషా - యిందున నిల్వా - రావేయఘశోషా ॥

శ్రీమ॥ ఆవాహనం సమర్పయామి

శ్లో॥ రత్న సింహాసనం వందే । సంగృహాణ సమర్పితం
చంద్రమండల సంకాశం । సంస్మితానన పంకజం ॥

కం॥ సదమల దేసిక యికనా - హృదయంబను పీఠమందు నుత్సాహముతో - కదలక గూర్చొని యుండుము - సదయత యిదె రత్నసింహ్వా ॥ ద ॥ సనము గురుదేవా - నివసించు స-ద్గుణ మహానుభావా - కదలాని మెదలాని - కామ శూన్యుడవు యిం - పొదవా మీ కర్పించి పూజించెదను సింహా ॥ సనము గురుదేవా - నివసించు సద్గుణ మహన్భావా ॥

శ్రీమ॥ అనేక మణిమయ రత్నఖచిత సింహాసనం సమర్పయామి.

శ్లో॥ పాద్యం గృహాణభోస్వామిన్ । మయానీతం శుభప్రదం
కృష్ణవేణి జలం భక్త్యా । తీర్థపాద జగద్గురో ॥

కం॥ గంగయు యమునల జలమును - పొంగుచు దెచ్చితినిపాద - పుండరీకముల్ - కంగున పాద్యంబిదెగురు - పుంగవ గైకొనియు వీన్ని ॥ ద ॥ పోషించుమయ్యా - అవనిలో మీదూ - ధ్యాసావిడనయ్యా - అంగాగుణములు సర్వం - బణగాద్రొక్కియు నాదు-చెంగీట నివసించి భంగాముగాకుండ పోషించూమయ్యా - అవనిలొమీదూ - ధ్యాసా విడనయ్యా॥

శ్రీమ॥ పాదయో పాద్యం సమర్పయామి.

శ్లో॥ అర్ఘ్యం దాస్యామ్యహం భక్త్యా । తవపాణి తలేవిభో
గోదావరీ జలంహేమ । కలశస్థం సువాసితం ॥

కం॥ చింతలెడబాపి తంతుల - వింతలు సర్వంబు త్వరలో - విడద్రోచియునా - మంతనమునందు వెరువక - సంతన హస్తముల కర్ఘ్య ॥ ద ॥ జలమూ లొనగెదనూ - గైకొనుమునా మలినంబు బోనూ - సంతాత మొకరీతి సర్వంబునందు అ-నంతమై యున్నట్టి ఆర్య మీకిదె ఆర్ఘ్య ॥ జలమూ లొనగెదనూ - గైకొ మునా - మలినంబు బోనూ ॥

శ్రీమ॥ హస్తయో అర్ఘ్యం సమర్పయామి.

శ్లో॥ ఆచమ్యతాం మయాదత్తం । హేగురో యమునా జలం
త్వదర్థ కృపయా భావ । భవబాధ నికృంతనా ॥

కం॥ మునులు సురలందరును శం-కనుమానియు యెపుడు మీదు - కళలో లీనం - బునుగైరి దేశికోత్తమ - వనజారి కళలు మించూ ॥దరువు॥ వదనంబూనకును - ఆచమనీయ్య - మిదె యొనర్చెదనూ - వనిబూని యీ భక్త - వరుని పాలించగ - జనుదెంచి నట్టి పావన పురుషమీముద్దు॥ వదనంబూనకునూ - ఆచమనీయ్య - మిదె యొనర్చెదనూ॥

శ్రీమ॥ ముఖే ఆచమనీయ్యం సమర్పయామి.

శ్లో॥ శర్కరా దధి మధ్వాజ్య । క్షీరమిశ్ర మిదం విభో
పంచామృతం మయాదత్తం । స్నానం కురు జగత్పతే ॥

కం॥ ఘృతముక్షీరంబు దధియను - అతిమధురంబైన తేనె

అలశర్కరయున్ - క్షితినైదు గూర్చిపంచా - మృతమునుగావిస్తి గొనుమ ॥ ద ॥ మోదంబు తోడఁ ప్రోక్షింతునీ - పాదంబు పైనఁ - క్షితి మదములను స - మ్మతితోడ దున్మియు - అతిహితావుగను సంతతము మీకర్పిస్తి ॥ మోదంబుతోడఁ - ప్రోక్షింతూనీ - పాదంబు పైనఁ ॥

శ్రీమ॥ పంచామృతస్నానం సమర్పయామి.

శ్లో॥ తప్తకాంచన కుంభస్థం । కించిదూష్ణ సువాశితం
మయానీతం జహ్నుకన్యా । జలస్నానం కురుప్రభో ॥

కం॥ మలముల మానియునా సం - కులముల జిమ్మేసి కామ - క్రోధము లణచీ - తెలిపనె శుద్ధజ్ఞానము - జలమిదె బుద్ధోదకంబు ॥ ద ॥ చరణా కమలములఁ - గడుగుటకూని - త్వరిదెస్తివేగఁ - యిల ఆనందాభాష్ప ములతోడ నాదుకన్నుల యందు యరుదెందు - జలమే శుద్ధోదకము ॥ చరణా కమలము లఁ - గడుగుటకూని - త్వరిదెస్తి వేగఁ ॥

శ్రీమ॥ శుద్ధోదక స్నానం సమర్పయామి.

శ్లో॥ వస్త్రయుగ్మం మయాదత్తం । త్వదర్థ స్వర్ణతంతునా
నిర్మితం నిర్మలం స్వామీఁ । నిత్యకల్యాణ పావనా ॥

కం॥ శేలుగ భక్తులకును సౌ - శీలుడవై బోధదెల్పు - శ్రీగురు దేవా - మేలగు స్వర్ణము తంతుల - చేలంబర్పింతు మెన॥ ద ॥ చేకొనుమయ్యా - సందేహముల - బోకార్చుమయ్యా-నాలోన యున్నట్టి నరిషడ్వర్గములాను - వాలా యంబుగానూ - వదలి యుంటినిశాలు ॥ చేకోనుమయ్యా-సందేహముల-బోకార్చుమయ్యా॥

శ్రీమ॥ అలంకారణార్థం వస్త్రయుగ్మం సమర్పయామి,

శ్లో॥ కార్పాస తంతునా శుభ్రం । రచితం తేర్పితం మయా
సంగృహాణ మిదం యజ్ఞ । సూత్రం పాత్రం దయానిధే॥

కం॥ యీళపింగళ సుషుమ్నా - నాళంబున యెప్పుడు హంస - నాడుచుసుండే - మేలిమి తారక మనియెడు - యీ లో యజపంబుగా ఇ ॥ ద ॥ త్రిదెమీకు జంద్యం - వేశితిగా నునా - మదికి ఆనందం ఫాలాక్షామర వినుత - పరమ పావన దేవా - నాలోన భజియించి - నర్పించితిని ॥ గాయిత్రిదె మీకు జంద్యం - వేశితి గొనునా మదికి ఆనందం ॥

శ్రీమ॥ యజ్ఞోపవీతం సమర్పయామి.

శ్లో॥ కిరీట కుండలం రత్న । కంకణాది నితేమయా
సంగృహ్యతాం భూషణాని । అర్పితాని నిరంజన ॥

కం॥ శిరమునకు కిరీటంబును - కరముకు కంకణము లిదుగా - ఘనవీనులకున్ - మరికుండలములు గళమున - ధరియించుము చంద్రహార ॥ ద ॥ దళిత రత్నములా - పేరులువేతు - యిలయందు చాలా - నరగూన యీభక్త - వరుని కోరికదీర - గురితోడ సర్వాంగా భరణముల్ మీకిడితి ॥ దళితరత్నములా - పేరులువేతు - యిలయందు చాలా ॥

శ్రీమ॥ సర్వాభరణ భూషణాన్ సమర్పయామి.

శ్లో॥ మలయాచల సంభూతం । కర్పూర కలితం విభో
విలేపనం త్వదర్థంభో ॥ గృహ్యతా మర్పితం మయా ॥

కం॥ మలయజము చందనంబును - ఇలకర్పూరము సువాస నీవీభూతిన్ - అలర త్రిచూర్ణము దెస్తిని - చలగియు

లేపనముజేయు ॥ ద ॥ చంచాలహరణా - సద్గురవే ప్రపంచా విహీనా - కలరీతి గన్పించు ఘనబ్రిహ్మాండము యెరు- కలగాల్చి భస్మంబు గాదె స్తి ధరియించు ॥ చంచాలహరణా - సద్గురవేప్రపం చావిహీనా ॥

శ్రీమ॥ శ్రీగంధం సమర్పయామి,

శ్లో॥ తండులాన్ ధవళాకారాౕ । హరిద్రా చూర్ణమిశ్రితాం
గృహ్యతా మక్షతాౕ దేవ । మయాదత్తాౕ మనోహరాౕ ॥

కం॥ వ్రజ్ఞనెడు వడ్లుదంచియు - అజ్ఞానంబనెడు తవుడు- నానెరిగెలును - విజ్ఞానంబుతో దీసియు - సుజ్ఞానంబనెటి మంచి ॥ ధ ॥ సురటీ యక్షంతల్ జల్లెదను సుం - దరమౌ ప్రవింతల్ - అజ్ఞానులయిన కృతజ్ఞులౌ మిముజేర - యేజ్ఞాన వంతులకో - యెర్పడును నీరూపు ॥ సురటీయక్షంతల్ - జల్లెదను సుం - దరమౌప్రమితల్ ॥

శ్రీమ॥ అక్షతాౕ సమర్పయామి.

శ్లో॥ పుష్పాన్యనేకాని । సుపల్లవాని
సుగంధయుక్తాని । మనోహారాణి
త్వాంగృహ్యతాం । దేవమయార్పితాని
జలాశయస్థాని । జపాదీకాని ॥

కం॥ చంపక చెంగల్వులు బహు - సొంపగు మల్లెలును మొల్ల - సురపుష్పంబుల్ - యింపు దాసానిగోగులు - కెంపుతో సమమైన జాజి ॥ ద ॥ కేదంగిపూలా - యర్పింతు మీ పాదపద్మ ములా - కంపాము బాయుటకు - ఘనమూగ నేదలచి - తెలింపీ

మీకొసగీతి - దివ్యతులసియు బిల్వ॥ కేదంగిపూలా - యర్పింతుమీ పాద పద్మములా ॥

శ్రీమ॥ పుష్పం సమర్పయామి.

-( అథ అంగపూజ )-

౧ తీర్థ పాదాయనమః । పాదౌ పూజయామి.
౨ నిగమ మంజీరాయనమః । గుల్ఫౌ పూజయామి.
౩ స్మరతూణీర జంఘాయనమః । జంఘౌ పూజయామి.
౪ ముక్తికాంత సేవితాయనమః । జానునీం పూజయామి.
౫ రత్న స్తంభోరు యుగళాయనమః । ఉరూంపూజయామి.
౬ పులినతల జఘనాయనమః । జఘనౌ పూజయామి.
౭ మణికాంచి కలాప శోభితాయనమః । కటింపూజయామి.
౮ గంభీరనాభి మండలాయనమః । నాభీం పూజయామి.
౯ విశ్వోదర రాయనమః । ఉదరం పూజయామి.
౧౦ దయార్ధ్ర హృదయాయనమః । హృదయం పూజయామి.
౧౧ విశాల వక్షాయనమః । వక్షస్థలం పూజయామి.
౧౨ కంబుగ్రీవాయనమః । కంఠం పూజయామి.
౧౩ వరదాన ధురీణాయ నమః । హస్తౌ పూజయామి.
౧౪ ఉన్నత స్కంధాయనమః । భుజౌ పూజయామి.
౧౫ స్మితవక్త్రాయనమః । వక్త్రం పూజయామి.
౧౬ చంపక నాసాయనమః । నాసికాం పూజయామి.
౧౭ పల్లవాధరాయ నమః । అధరం పూజయామి.

౧౮ పుండ్రేక్షు కార్ముక భృవేన్నమః । భ్రూ యుగ్మంపూజయామి.

౧౯ కరుణాకటాక్ష వీక్షణాయ నమః । నేత్రాపూజయామి.

౨౦ రాకాసుధాంశు వదనాయనమః । ముఖం పూజయామి.

౨౧ పుష్ప కార్ణాయ నమః । కర్ణౌ పూజయామి.

౨౨ సు లలాటాయ నమః । లలాటం పూజయామి.

౨౩ నీలకుంచిత మూర్ధజాయ నమః । కేశాన్ పూజయామి.

౨౪ సువృత్త శిరస్కాయనమః । శిరః పూజయామి.

౨౫ సర్వాత్మ నేన్నమః । సర్వాంగాని పూజయామి.

## -( అథ పత్రపూజః )-

౧ అచింత్యాయనమః । బిల్వపత్రం - సమర్పయామి.

౨ బృందారక వందితాయనమః । తులసీదళం సమర్పయామి.

౩ భువనరక్షణ తత్పరాయనమః । వకుళ పుష్పం - సమర్పయామి.

౪ భూరివిభవాయనమః । పున్నాగ పుష్పం - సమర్పయామి.

౫ జగజ్జనన కారణాయనమః । కేతకీపత్రం - సమర్పయామి.

౬ చరాచరగురవేన్నమః । చామంతికాపుష్పం - సమర్పయామి

౭ సుప్రభావాయనమః । చంపకపుష్పం - సమర్పయామి.

౮ సుప్రసన్నాయనమః । పాటలీపుష్పం - సమర్పయామి.

౯ అపవర్గ ప్రదాయనమః । శతపత్రపుష్పం - సమర్పయామి.

౧౦ అనంతాయనమః । జాజీపుష్పం - సమర్పయామి.

౧౧ మోహవర్జితాయనమః । కరవీరపుష్పం । సమర్పయామి.
౧౨ ముకుందాయనమః । రసాల పుష్పం — సమర్పయామి.
౧౩ ప్రకృతి పురుష విలక్షణాయనమః । మాలతీపుష్పం - సమర్పయామి.
౧౪ నిత్యాయైనమః । కల్హారపుష్పం - సమర్పయామి.
౧౫ ఆజ్ఞేయ చక్రనిలయాయ నమః । ఆతసీపుష్పం - సమర్పయామి.
౧౬ నాదుబిందు కళాతీతాయనమః । పారిజాతపుష్పం - సమర్పయామి
౧౭ భూతాత్మనేనమః । అశోకపుష్పం - సమర్పయామి.
౧౮ మండలత్రయాతీతాయ నమః । నీలోత్పల పుష్పం - సమర్పయామి.
౧౯ అనంతాయనమః । మల్లి కాపుష్పం — సమర్పయామి.
౨౦. అవ్యక్తాయనమః । మాలతీ పుష్పం - సమర్పయామి.

—: అథ అష్టోత్తర శత నామావళీ :—

౧ సద్గురువేన్నమః
౨ పూర్ణాయనమః
౩ సర్వాధారాయనమః
౪ స్వచ్ఛాయనమః
౫ శుద్ధాయనమః
౬ నిర్మలాయనమః
౭ విశ్వోదరాయనమః
౮ నిరాలంబాయనమః
౯ రమ్యాయనమః
౧౦ నిర్లేపాయనమః
౧౧ నిర్వాసనాయనమః
౧౨ నిర్గంధాయనమః
౧౩ స్వప్రకాశాయనమః
౧౪ నిత్యతృప్తాయనమః

౧౫ అనంతాయనమః
౧౬ అద్వితీతాయనమః
౧౭ వేదవాచామ వేద్యాయనమః
౧౮ పరంజ్యోతిషేన్నమః
౧౯ ప్రణవాతీతాయనమః
౨౦ అచలాయనమః
౨౧ అపరిమితాయనమః
౨౨ అప్రమేయాయనమః
౨౩ అవ్యయాయనమః
౨౪ అచ్యుతాయనమః
౨౫ అహంకార వివర్జితాయనమః
౨౬ విశ్వాత్మనేనమః
౨౭ ప్రపంచాతీతాయనమః
౨౮ మాననీయాయనమః
౨౯ క్షరాక్షరవిలక్షణాయనమః
౩౦ దృగ్దృశ్యాతీతాయ ,,
౩౧ ద్వైతాద్వైతావినుర్ముక్తాయ,,
౩౨ అఖండాయ ,,
౩౩ ఖండాఖండ విరహితాయ ,,
౩౪ ఆదిమధ్యాంతశూన్యాయ ,,
౩౫ నిరంజనాయ ,,
౩౬ నిర్వికల్పాయనమః
౩౭ నిరాకారాయ ,,
౩౮ నిరాఖ్యాతాయ ,,
౩౯ పరమానందస్వరూపాయ ,,
౪౦ సగుణనిర్గుణాతీతాయ నమః
౪౧ సర్వసాక్షిణే ,,
౪౨ సాక్ష్యాతీతాయ ,,
౪౩ త్రిగుణాతీతాయ ,,
౪౪ సర్వభూతాంతస్థాయ ,,
౪౫ సుఖదుఃఖవిరహితాయ ,,
౪౬ జన్మజరామరణ వర్జితాయ
౪౭ క్షేత్రజ్ఞాయ ,,
౪౮ సర్వోపనిషత్సారాయ ,,
౪౯ నిష్కళంకాయ ,,
౫౦ నిరాభాసాయ ,,
౫౧ స్వప్రకాశాయ ,,
౫౨ సృష్టిస్థిత్యంతకారణాయ,,
౫౩ కర్తృత్వరహితాయ ,,
౫౪ సచ్చిదానందాతీతాయ ,,
౫౫ అపరోక్షాయ ,,
౫౬ సకలమంత్రస్వరూపాయ,,
౫౭ ఆకాశతనవేన్నమః ,,
౫౮ నిరాధారాయ ,,
౫౯ నిస్తేజసేనమః ,,
౬౦ అవికారాయ ,,
౬౧ అమలాయ ,,
౬౨ పరతత్వాయ ,,
౬౩ పరంధామే ,,
౬౪ అజాయ ,,

౬౫ అగమ్యాయనమః
౬౬ షడ్గుణైశ్వర్యసంపన్నాయ,,
౬౭ సనాతనాయ ,,
౬౮ త్రిమూర్త్యాత్మనే ,,
౬౯ అనాద్యంతాతాయ ,,
౭౦ సర్వోపాధివినుర్ముక్తాయ ,,
౭౧ భక్తాభీష్ట ఫలప్రదాయ ,,
౭౨ భవరోగభేషజాయ ,,
౭౩ సహస్రారచక్రమధ్యస్థాయ,,
౭౪ సనకాదిమునివందితాయ ,,
౭౫ కామక్రోధాదిశత్రునికృంతనాయ ,,
౭౬ కరుణారసార్ద్ర హృదయాయ ,,
౭౭ బ్రహ్మవిష్ణుమహేశ్వరస్తుతాయ ,,
౭౮ బ్రహ్మాండజనకాయ ,,
౭౯ పరమపావనాయ ,,
౮౦ దీనజనానుగ్రహాయ ,,
౮౧ దివ్యపురుషాయ ,,
౮౨ ప్రసన్నపారిజాయ ,,
౮౩ పురాణపురుషాయ ,,
౮౪ నిరుపద్రవాయ నమః ,,
౮౫ నిత్యకల్యాణాయ ,,

౮౬ సర్వోపనిషత్పంజరకీరాయ
౮౭ శబ్దాతీతాయనమః నమః
౮౮ జగన్నాథాయ ,,
౮౯ జగద్గురవే ,,
౯౦ విష్ణవే ,,
౯౧ సర్వతో భద్రాయ ,,
౯౨ నిగమార్థప్రతిపాదకాయ,,
౯౩ నిస్సంగాయ ,,
౯౪ సహజానందాయ ,,
౯౫ చిన్మయాయ ,,
౯౬ శ్రీమతే ,,
౯౭ సాయుజ్యప్రదాయ ,,
౯౮ సహజామనస్కాయ ,,
౯౯ పంచబ్రహ్మమయాయ,,
౧౦౦ అజడాయ ,,
౧౦౧ జడాజడవిలక్షణాయ ,,
౧౦౨ భావాభావ మధ్యస్థానాయ
౧౦౩ అమనస్కాయ ,,
౧౦౪ అఖిలాండకోటి బ్రహ్మాండనాయకాయ ,,
౧౦౫ సర్వోదయే ,,
౧౦౬ పరాత్పరాయ ,,
౧౦౭ లక్షాతీతాయ ,,
౧౦౮ మనోవాగ్గోచరాయ ,,

శ్రీమ॥ నానావిధ పరిమళ పత్రిపుష్పాణి సమర్పయామి.

శ్లో॥ చందనాగరు । కర్పూర
శర్కరాజ్య । సమన్వితం
ధూపోయం గృహ్యతాం । స్వామిన్
త్వమిదంతే । మయార్పితం ॥

కం॥ త్రయవాసన త్రయయీషణ - త్రియదేహంబులు నవస్థ త్రియముల్ సర్వం - త్రయతాపంబులు మీకిదె - నియముగ ధూపంబునిస్తి ॥దర్వు॥ నికనుగైకొనుమీ - ఆఘ్రాణించుచు - సకలేశ స్వామీ - భయనిర్భయ ములులేనీ - బయలు జూపియు యెరుక - నయమూతో విడిపించివదిమీకు ధూపముగ ॥ నికను గైకొనుమీ - ఆఘ్రాణించు - సకలేశస్వామీ ॥

శ్రీమ॥ ధూపమాఘ్రాపయామి

శ్లో॥ వహ్నినా యోజితం సాజ్యం । దీపం వర్త్రత్వయాన్వితం
గృహాణజ్ఞాన తిమిర । హరజ్ఞాన ప్రవర్తనం ॥

కం॥ కామక్రోధము లోభము - వామూర్ఖపు గుణములన్ని - వత్తులుజేసి - పామరమనియెడు చముడను - నీమంబుగ బోసియుంచి ॥ ద.॥ నీ మంత్రికళనూ - యంటించిన స్వామీ దీపమునూ - ఉూ మహి వెల్గూచు - ఏకరీతిగ యుండె - భ్రామీకల్ దీరాగ వదపాడి దర్శించు ॥ నీ మంత్రికళనూ యంటించిన స్వామిదీపమునూ ॥

శ్రీమ॥ దీపం దర్శయామి.

శ్లో॥ శాల్యన్నం షడ్రసోపేతం । పంచభక్ష్యాది సంయుతం
నైవేద్యం దేవ దధ్యాజ్య । సమ్మిశ్రిం ప్రతిగృహ్యతాం ॥

కం॥ పరమాన్నము భక్ష్యంబులు - అరిశెలు బూరెలు సుశర్కరాది పొంగళుల్ - మరిఘృత మిశ్రిత లాడూల్ - మురి పెంబుతొముందు నిడితి ॥ ద ॥ మునునారగించూ - నాదుర్ఘోష-ములను దొలగించూ - గురుదేవా యీదీన - నరుని పోషించను స్థిరమైన బోధయీా క్షితిదెల్పి ఆహార ॥ మును నారగించూ - నా దుర్ఘోష - ములను దొలగించూ ॥

శ్రీమ॥ మహా నైవేద్యం సమర్పయామి.

శ్లో॥ పానీయ్యం శీతలం స్వచ్ఛం । మధ్యేమధ్యే మయార్పితం
సుగంధయుక్తం మధురం । పిబత్వం పురుషోత్తమ ॥

కం॥ భేదంబుల దొలగించియు - ఖేదము మోదంబు లేని - కేవలఅత్మా - బోధయు విన్పియు జన్మా - బాధను రాకుండ జేయు ॥ ద ॥ పరమపావనుడా - మ్రొక్కెద పాద - వనజాముల్ ప్రౌఢా - యీధరణి లోనాపా - నీయముల్ మీకిడితి ఆదరణ జేసియు - నవియు గైకొనుమార్య ॥ పరమా పావనుడా - మ్రొక్కెదపాద - వనజాముల్ ప్రౌఢా॥

శ్రీమ॥ మధ్యేమధ్యే వుదకపానీయం సమర్పయామి.

శ్లో॥ సుపక్వాన్యనేకాని । రంభాంమ్రజంభూన ఖర్జూర
నారంజి ద్రాక్షాదికాని । త్వమేతాని సంగృహ్యతాం
స్వప్రికాశ । ఫలాని ప్రిదేయాని సర్వాణి తేజ్య ॥

కం॥ కదళీపనసయును నింబయు - మధురంబగు చూత
ద్రాక్ష - మరి ఖర్జూరాల్ - ముదమొప్ప జామ నేరడి - బదరుల్
ముక నారికేళ ॥ ద ॥ ఫలమూలు గొనుడీ - యర్పణ జేస్తి -
భక్తితో గనుడీ - వ్యవదీసు కొరకునీ పదమూల పూజింప -
మదిసంతోషంబాయె - మానివినుతాయిట్టి ఫలమూలు గొనుడీ -
యర్పణజేస్తి భక్తితో గనుడీ॥

శ్రీ మ॥ నారికేళ ఫలనైవేద్యం సమర్పయామి.

శ్లో॥ తాంబూలం గృహ్యతాం పూగీ । ఫలకర్పూర సంయుతం
నాగవల్లీదళాద్యంతం । గురోతుభ్యం మయార్పితం ॥

కం॥ మెప్పగు జాజిలవంగము - గొప్పగు యాలకులు
జాత్రి కోరిక ఆకుల - కప్పుర విడెమని మీకును - తప్పక నర్పి
స్తిదెన్ని ॥ ద ॥ దయతో చేకొనుమా - దేసికనాదు - తప్పులెన్న
కుమీ - యెప్పుడు నీస్మరణ - యే మారకనుజేయ - తిప్పలు
బాపి మేలొప్ప బ్రోచినతండ్రీ ॥ ఒయతో చేకొనుమీ - దేసికనాదు
తప్పులెన్నకుమీ ॥

శ్రీ మ॥ తాంబూలం సమర్పయామి.

శ్లో॥ సువర్ణోదర గర్భస్త్వం । స్వర్ణబీజం మయార్పితం
అనంత పుణ్యదం స్వామిన్ । తేగృహ్ణాత్వ మచ్యుతం ॥

కం॥ కనకంబుతో నిర్మించియు - ఘన కెంపులు దాపి
నట్టి - ఘనపుష్పములున్ - వినయము సువర్ణ మంత్రం -

బనెవిరియిడె నీకునేయ ॥ ద ॥ ర్పణజేతు గొనుడీ - పావన చరిత ననుమన్నించుడీ - ఘనమైన పూర్ణంబు గాంచీన యాయెరుక - యునుమీకు గురుదక్షణగా చేసియునేయ । యర్పణజేతు కొనుడీ- పావన చరితా - నను మన్నించుడీ ॥

శ్రీ॥ సువర్ణ మంత్రపుష్పం సమర్పయామి.

శ్లో॥ నీరాజనం మయాదత్త । రాజ రాజేశ పూజితం
గృహాణ జగదుత్పత్తి । హేతుభూతాఘ నాశన్నం॥

కం॥ బంగారు పళ్ళెరంబున - రంగగు యాదీపకళిక - లందునజేర్చి పొంగుచు ముట్టించుయు నే - మంగళముల్ నొసగె దాను ॥ద॥ మహనీయ్య దేవా - గైకొనుమోహ - రహిత సద్భావా - శృంగారములును జెలంగ పాడుచు చుట్టు - అంగాన మణులంతా హారతి నొసగిరి ॥ మహనీయ్య దేవా - గైకొనుమోహ- రహిత సద్భావా ॥

శ్రీమ॥ మంగళ నీరాజనం దర్శయామి.

శ్లో॥ సుకేతకీ పాటల । పారిజాత
చాంపేయ కంజాత । రసాలమల్లికా
చామంతికాసంయుత । మంత్రపుష్పం
గృహ్ణామివిష్ణోశివ । శంకరాచ్యుత ॥

కం॥ కరవీర మల్లెలుమొల్లలు - సరసిజముల్ గోగుపత్రి- సంపెంగలునూ - మరి చెంగల్వలు కల్హార - విరులివే యర్పింతుమంత్ర ॥ ద ॥ విధిపుష్పమంచూ - గైకొను గురవే - ముదమూను మించూ - పరమాత్మ నినుజేరి దరికి ముట్టిరిభక్తవరులెల్ల

పరికించి మరినొసగిరిదె మంత్ర ॥ విధిపుష్పమంచూ - గైకొను గురవే - ముదమూను మించూ ॥

శ్రీమ॥ దివ్య సువర్ణ మంత్రపుష్పం సమర్పయామి.

శ్లో॥ జన్మాంతర కృతాన్యాని । యాని పాపాని మేప్రభో
నశ్యంతుతే తానితాని । ప్రదక్షణ పదేపదే॥

కం॥ అక్షయ బోధను దెల్పియు - ముక్షువు బంధంబు మాన్పి - ముందుగ నీన్నిల్ - రక్షించి బ్రోచినాడవు - అక్షతలల్ వేసినే ॥ద॥ ప్రదక్షణాల్ చేతూ - సద్గురుదేవా - దీక్షాలల్ బాపూ - యీక్షితిలో మిముమించ - యెవరిగానమురవ - రోక్షమార్గము దెల్పి రోశించె యెరుక పరి ॥ దక్షణల్ జేతూ - సద్గురుదేవా - దీక్షాలల్బాపూ ।

శ్రీమ॥ ఆత్మప్రదక్షణ నమస్కారాల్ సమర్పయామి.

శ్లో॥ యస్యస్మృత్యాచనామోక్త్యా । తపఃపూజా క్రియాదిషున్యూనం
సంపూర్ణతాంయాంతి । సద్యో వందేవమచ్యుతం ॥

శ్లో॥ మంత్రహీనం క్రియాహీనం । భక్తిహీనం జనార్దన
యత్పూజితం మయాదేవ । పరిపూర్ణం తదస్తుమే ॥

శ్లో॥ అజ్ఞాన మూలహరణం । జన్మకర్మ నివారణం
జ్ఞాన వైరాగ్య సిద్ధ్యర్థం । గురుపాదోదకం పిబేత్ ॥

శ్లో ॥ గురుపాదోత్థితం తీర్థం । పీత్వా త్రిపుటి నాశనం
సర్వద్వంద్వ వినాశంచ । విద్యతే న పునర్భవం ॥

శ్లో॥ గచ్ఛాద్య పునరాగచ్ఛ । మామకా భీష్ట సిద్ధయే
గురోర్యః కృపయా వీక్ష । పూజాం స్వీకురు మత్కృతం ॥

## శ్రీఅచలగురు పరంపర మంగళహారతి

౧. శ్రీకరంబైనట్టి ఓంకార పీఠమున । ప్రాకటంబుగ హరికి, భానునకునూ । ఏకముగ వెలిగేటి యాజ్ఞావల్క్యకి మరియు । జోకతో రాజఋషి జనకపతికీ జయా ॥ జయమంగళం నిత్య శుభ మంగళం । జయతు జయమంగళం మహోత్సవ మంగళం ॥

౨. శుద్ధతత్వజ్ఞుడౌ శుకయోగికిని నిత్య । సద్ధర్మమార్గుడౌ సొందిపునకూ । సిద్ధముగ పూర్ణుడౌ శ్రీకృష్ణమూర్తికిని । వద్ధికతొ అర్జునా వృద్ధవునకూ జయా ॥ జయమంగళం ॥

౩. శ్రీమించివెలిగేటి శ్రీధరస్వామికిని । ధీమించు శివరామ దీక్షితులకూ । కామితార్థము నిచ్చు ఘన అప్పబ్రహ్మముకు । వేమారు శ్రీసీతరాములకునూ జయా ॥ జయమంగళం ॥

౪. పరిపూర్ణబోధనూ ప్రకట పరచిన యట్టి । వరభాగవత కృష్ణగురునకిపుడూ । నిరతంబు పరతత్వ మెరిగించు పీఠాన । వరలక్ష్మిణా ప్రభూ చరణములకూ జయా । జయమంగళం ॥

౫. స్థిరమైన ఓంకార గురుపరంపర యందు । పరిపూర్ణ సిద్ధాంత భావవములనూ । నిరతమ్ము భక్తులకు కరుణతో బోధించు । గురుడు నిత్యానంద సీతయార్యులకుకూ జయా ॥ జయమంగళం ॥

హారతిదుగో మంగళహారతిదుగో । సద్గురు మూర్తికి హారతిదుగో ॥మంగళం॥

హారతిదుగో జగతియందున అచల పరిపూర్ణాతత్వవి ।దారు లగు సాందీపమహాఋషి స్వాములకు, శ్రీ కృష్ణునకునూ ॥హారతి॥

పండరీపురమందు నిలచి, భాగవతమూ భగవద్గీతల । ఖండముగ భక్తులకు దెల్పిన కారణుండగు శ్రీధరేంద్రుల ॥హారతి॥

వాసిగా బృహద్వ శిష్ఠము వ్రాసి నారాయణ పురంబున । దేశములలో ప్రకట పరచిన దేశికులు శివరామ దీక్షితుల ॥హారతి॥

స్థిరముగను కంబాలూరి పురము నందున అచల బోధను, మరియుచును భక్తులకు దెల్పి । ముక్తి నొసగిన అప్పారావుకు॥హా॥

పరమపావనమైన యెఱ్ఱగొండపాలెమున భద్రాద్రిరామ । పరమ శతకము వ్రాసినట్టి పరశురామ నారసింహుల ॥హారతి॥

మరియునాపాళెములో నిలచి, పరమ తత్వము బోధపరచిన। పరశురామ వంశభవ శ్రీ ప్రభువు సీతారాములకునూ ॥హారతి॥

దక్కన్ హైదరబాదు లోపల మక్కువతొ కందార్థములను। చక్కగా రచియించినట్టి సద్గురు భాగవత కృష్ణున ॥హారతి॥

మేలిమిగ వేగంవేటలొ చాలగా పరతత్వములు గురు । బాలులకునూ బోధపరచిన పీలుఖానా లక్షణార్యుల ॥హారతి॥

అచ్ఛముగ శ్రీ అచల బోధను చొక్కముగ నూబోధ పరచిన చక్కగను పరిపూర్ణ శ్రీకొండోజు సీతాయా ర్యులకు నూ ॥హారతి॥

## మంగళహారతి

౧ శ్రీశుభదమైనట్టి । ప్రణవ పీఠంబున । వాసికెక్కిన హరికి
వనజాప్తుకు । భాసురంబు యాజ్ఞవల్కికిన్ రాజర్షి । దా
సుండు నౌజనక । ధరణీశునకున్ । జయమంగళం నిత్యశుభ
మంగళం జయతు జయమంగళం మహోత్సవ మంగళం॥

౨ ముందుగన్ శ్రీశుకా । మునివర్యులకు వేడ్క । సాందీప
శ్రీకృష్ణ స్వాములకునూ । అందమౌ యుద్ధనూ అర్జునున
కున్ యర । విందనయనౌ రుక్మి । ణీమాతకు ॥జయ॥

౩ బేధరహితుండగు । శ్రీధర స్వామికి । ఈధరన్ శివ
రామ దీక్షితులకు ఆదరణ జేసిన । అప్పబ్రహ్మంబుకు ।
సాధు సీతారామ । స్వామి నరసింహులకు ॥జయ॥

౪ శుద్ధ నిర్గుణబోధ । శృతపరచు భాగవత । సద్ధర్మ శ్రీకృష్ణ
చంద్రునకును । వద్దికతో పీఠ్లాన । వంశ ప్రకాశున ।
భేద్యులక్ష్మణుడు శంక రార్యులకునూ ॥జయ॥

౫ గురు సచ్చిదానంద । వరవెంకటేశ్వరుకు । స్థిరమతుడు
కొండోజు శీతార్యకూ । మరల జన్మము రాని మార్గమ్ము
లనుదెల్పు పరిపూర్ణులైన సద్గురువరులకూ ॥జయ॥

## ద్వాదశాక్షరి

ఏత స్మిద్భ్యా శుద్ధ వియత్ కించి న్నాస్తి
ఈ పుత్త బట్ట బయలు ఏమి లేదు

షో డ శా క్ష రి

నిర్మూల మేతదా జ్ఞాన శ్చరీరం నాస్తి కేవలం
మూలకలేని యీ గుర్తెరిగే శరీరం యేమి లేదు

పం చ ద శి

శ్లో॥ స్వప్నే ప్రతీయ మానాని । రూపానిచ యథా తథా
కర్పూర దీపసంయోగం । జ్యోతిరూపం యథాతథా ॥

ద్వ॥ కలలో దోచిన శరీరంబు యేలాగో ఆలాగే

దా॥ కర్పూరము కళిక కూడితే యేలాగో ఆలాగే

కం॥ శ్రీపీఠ్లాన సువంశుడు । నాపాలి గురుండు లక్ష్మణాచా
ర్యులకున్ । నేపూజ నలిపియును నా । పాపంబుల బాసి
నాడ భక్తి యుతుడనై ॥

శ్రీపీఠ్లాన లక్ష్మణాచార్య సద్గురు మహరాజకీ జై

అనుష్ఠాన విధి సమాప్తం

---

## అచలగురు శ్రీ నిత్యానంద కొండోజు సీతయార్య దేశికేంద్రులవారు రచియించిన తత్వములు

---

### 1 శహనరాగము - అట.

౧ ఎంత చక్కని మార్గము అయ్యలారా ॥ ఎంత ॥ తెలిసిన వారి కెంత సులభ మార్గము । తెలియని వారికెంత కఠిన మార్గము ॥ ఎంతచక్కని మార్గము ॥ యిదియెందుజూచిన నందులేకను । సంతతంబొక రీతినుండెను । స్వానుభవ పరు లకును జూడ ॥ ఎంత ॥

౨ అందుకే సాందీపుని కృష్ణుండు యిం । పొందగ సేవిం చియూ । సందేహములుదీరె చక్కగా శివరామ । దీక్షి తుల శిష్యుడై తిరిగి అప్పయమంత్రి । పొందుగా వేద ములసారము । పూర్తిగా గ్రహియించె పరశు । రామ శీతా రామమూర్తి । భాగవత కృష్ణునకు దెల్పెను ॥ ఎం ॥

౩ పరుసతో భాగవతుల కృష్ణుడు పీ । ల్లానా లక్ష్మణునకు దెల్పెను । అరయ పీల్లానా । లక్ష్మణదేశికప్రభువు । అరయ కొండోజు శీతరామయను బిల్చి । పరగ జన్మ కర్మములునీ । కరయ లేవని । పూర్ణంబు స్థిరముగా బోధించి దరిజే ర్చిన గురోత్తము కూరి సుభిరెక ॥ ఎం ॥

2 యదుకుల కాంభోజీ - జుల్వతాళము

౧ చిక్కదయా యీ మాయా । సిద్ధాంతులకు దవ్వు ॥చిక్క॥
మక్కువతొ యీ మాయ । మర్మమేమొ దెలియదా
యె ॥ చిక్క ॥

౨ యోగు లందరినీ । యొప్పుగ జుట్టిపెట్టె । జాదు సేయ కం
దరినీ । చక్కగానె అమ్ముచుంది ॥ చిక్క ॥

౩ ముగ్గురు మూర్తులను । ముడిబెట్టి వేృమతో । ఎగ్గులేక
వచ్చేవార్ని । ఏమిలేక మిృంగుచుండె ॥ చిక్క ॥

౪ పంచ శక్తులను గూడ । ముంచివేసి విడిచుచుండె । ఎంచ
రాని యీ మాయ । కొంచముతో తెగదాయె ॥ చిక్క ॥

౫ కాసు వీసాలకు । కలలోన జిక్కబోదు । వేసధారులం
దరిని । గోసిలోన జుట్టిపెట్టె ॥ చిక్క ॥

౬ పీలుఖాన లక్ష్మణ గురుడు । వేృమతోడ బోధించి ।
మేలుగాను శీతారాముడా । మేటివానిగ జేసిపోయె ॥చిక్క॥

3 కీర్తన - యదుకుల కాంభోజి - ఆది.

౧ గురునామంబనె రాజమిఠాయి । కొనగల దొరలెవరండి
దీని తినగల దొరలెవరండి । కొనగల దొరలు కోటి
కొక్కరే । తినగల దొరలు నూటి కొక్కరే । హేమ
మునకు యిది జిక్కదు మిఠాయి । కామమునకు యిది

గల్గదు మిఠాయి । రామజోగియై । లంగోటి బన్‌కర్ యమలం చోడ్కే । పంచ మయిల్ మే । వకాయె మిఠాయి । చక్కగ మీరు సేవించండి ॥గురు॥

౨ శ్రవణము మననము నిధి ధ్యానయనె పొయ్యి బెట్టియు మూడు దేహములు కర్రిలుజేసి । సుజ్ఞానంబనె నిప్పు బెట్టియు । భక్తియను నదియే భాండము జేసి । విష్ణు వనేటి పాలు బోసియు । రుద్రుడనేటి చక్కెర జేర్చి । ద్వాదశి దినముల పాకము జేసి । లడ్డు బనాయా రాజ మిఠాయి । గురునాదముచే కీర్ బనాయా । భవబంధంబులు తెంపు జేసుకొని ॥ కొనగ ॥గురు॥

౩ స్పష్టముగను భుజియించిన వారికి । కష్టములన్నియు దొలిగి పోవును । నిష్ఠతొ నుండిన నిజగురువులతొ । అష్ట మదములచె కెంకెంలడితే । దుష్టసాంగత్యం దూర్ కరోరే । నష్టము లేక సద్గురుమూర్తియు । నంతట నున్నడు। తెలిసిన వారికి ॥ కొన ॥

౪ పీలుఖాన యీ లక్ష్మణ గురుడు । శీతరాములకు సౌజ్ఞ దెలిపెను । ద్వాదశి షోడశి ద్వయ మంత్రంబుల । జోలి చోడు దెరె । ద్వంద్వముక్యారే । ఏకం స్థిరమై వెల్గుచున్నది ॥ కొనగ ॥

## తత్వము.

౧ విన్నరా మీరు కన్నారా । వున్నదున్నట్లుమీరు । ఎన్నాడైన ఎరుక జగములు సున్నాయని ॥ వి ॥

౨ ఉత్త బట్టబయలుయని । ఉబ్బి గంతులు వేసేరు । సత్తు చిత్తు గానిదొకటి నిత్యమని ॥ వి ॥

౩ మూలము లేనట్టి మఱికి । తోలు బొమ్మల మాటలా । కీలు దెలసి జాడ నెరిగి । మేలుకున్న మాటలా ॥వి॥

౪ యాలలాగ పాటలు బాడి । లోలితమై దిరుగుటకా । మేలైన అచల మెరిగి మేదిని విడచుటకా ॥వి॥

౫ గురువులమాని గుఱుతు దెలియక । మరుగులోబడి చచ్చుటకా । హరహరాదుల కైనగాని అమిత మైనది తెలచుటకా ॥వి॥

౬ వేరు ప్రశ్నలు బెట్టుకొని । మురిపముతో మరి దిరుగుటకా మరుగులేని జాడ దెలసి । జనన మరణము బాసుటకా ॥వి॥

౭ ఇచ్ఛతో వచ్చే శిష్యులను । కుచ్చి మేడకు వేసుటకా । దీక్షలన్ని మాని గురు శిష్యుల గురుతులు పోవుటకా ॥వి॥

౮ లక్ష్మణ దార్యులు నిపుడు రాజయోగము నందును । వత్స శీతా రామని పిలిచి । ఇచ్ఛలన్ని మాన్పెను ॥వి॥

5 నాదనామ క్రియ రాగము - ఆట.

౧ నేజూచినానూ । నేననినీది ॥ నే ॥ నేజూచినానయ్య నీమముదప్పక । స్వామిసద్గురు సేవ। చక్కగజేసియు॥నే॥

౨ నామరూప క్రియానటన లేమియు లేక । ఏమని యనరాక । ఏకమైన దాన్ని ॥నేజూ॥

౩ ఆగమ ములకును । అతీత భావమై । బాగుగ భవనాశ । పథముగాని దాన్ని ॥నేజూ॥

౪ నాదుబిందు కళల పొదులేని మాయ । మోదఖేదము లొందె । వేదన లేనిది ॥నేజూ॥

౫ పంచవింశతిగాని । కొంచెగొప్పలు లేని । సంచిత కర్మల జాడ దెలియని దాన్ని ॥నేజూ॥

౬ సత్తుచిత్తుగాని । స్వర్గ నరకములేని । ఎత్తు పల్లములేక । ఏకమైన దాన్ని ॥నేజూ॥

౭ కరుణ పీఠాన లక్ష్మణ ప్రభువు దరిజేర్చి । వరశీతారాము నకు । వరము దెల్పిన గుర్తు ॥నేజూ॥



# పునర్జన్మ విచారము

మొదటి పరిసంగము :

సంపత్కరమైన ఈప్రపంచమందున తలిదండ్రుల కోరికచే పుట్టిన పుత్రులు తలిదండ్రుల నెరిగిన విధమున జీవిత సంపదలిచ్చెడు సృష్టినిగన ఇందుకు కారణమగు పరమాత్ముడు గలడని తెలిసినవిధమున గనుగొనసేర్పరిగిన జనులందున ఉత్తములగు తత్వజ్ఞులు గురుశిష్యుల న్యాయమునను గుర్తుకుతెచ్చిన శాస్త్ర జ్ఞానము గుర్తెరిగిన పూజ్యులు ఆయాకాలములందున తెలియని జనులకు దేవునిగనుగొను భక్తిచే సమిష్ఠినుందురు. జనులని బోధించుట సాధించిరి. అటుపై ప్రవక్తలెందరో బోధించుటలో అనుభవ బేధములందున జనులందరు బహుమతములు పాటించిరి. పాటించిన మతఅభిమానముచే తమతమ మతచిన్నహములను ధరించిరి. తమమతమును పాటించన సోదరబంధువులను సంబంధములేకను ఎడబాసిరిగదా! ఇక మతమున పాటించిన గురువుల ఆంతర్యము ఏమిటి ? పరమాత్ముని ఎరుగుటయా ? లేక ఎరుగని జనులను ఎడబాపులు జేయుటయా ? ఇందు సోదరజనులకు అయ్యెడు లాభమేమిటి ? ఇక మానవస్వాతంత్రము మరిపించెడు మతాధికారములో మానవులకు కలిగెడు ఫలమేమిటి ? బహువిధసాధన శ్రమలచే

గుర్తించిన పరమాత్ముని తెలిసినధీమంతులు మతమనుపేరట సమిష్టి జనులను విడదీసుటచే మతగురుల కయ్యేడు లాభమేమిటి? దేవుని కయ్యేడు నష్టమేమిటి? దేవునిచే ఎరిగించిన మతగ్రంథములకు నష్టముగలదా! ఏహేతువచేతను మతమున జేరిన మాత్రమున తమజాతిలో మతవైరము ఏర్పడెగదా! ఇక ఇందుకు సంసారులు పొందిన లాభమేమిటి? మానవులందరు దేవుని ఎరుగుటచే వారలకయ్యేడు ఫలమెరిగెడు ఉత్తమజాతులుఎందరో పరమతములో చేరిరిగదా! మతకలహములందున ఆధికారము కాంక్షించెడు శాస్త్రజ్ఞుల కందరకును బహుమతములు ఉండక తప్పవు. గురువులపై గలప్రేమచే సేవను భేదముచే కలహించెడు ఫల ఈ దుఃఖమునకు హేతువ గురువులబోధలచే కలిగినదా! పరమాత్ముని జూపుటచేకలిగినదా! బహుబాధలు పడు సంసారులు అనుభవించినది ఇందేమిటి? ఇక ప్రేమించిన మతములలో గొప్పది ఏదని అడిగినచో పరమతమెప్పుడు ఒప్పదుగదా! ఇట్లుండెడు మతములు గుర్తెరిగిన ఉత్తములగు వారెందరో వీరికి వేరగు మతములో చేరిన తమవారిని మావారని భావించెడు దెరుగని చదువరులెందరో ఉత్తములని వేదికపై నిలబడి దేవునిచేపుట్టిన జనులందరు ఒకటని వేదికపై చెప్పుటకిదువరు. వినుజనులందరు తలలూపుచు నుందురు. ఇక త్రిమూర్తులకే మతమేర్పరచిన ఉత్తమజనులందురు పరలోకమునను జూపించెరుగని దేవునికొక పాపము పుణ్యము తీర్చెడు న్యాయస్థానము గుర్తించిన శాస్త్రజ్ఞులు పరమతములలో చేరిన జనులను ఒకటిగజేసెడు మార్గము గుర్తించరుగదా! ఇట్లుం

డెడు వారిని బ్రహ్మజ్ఞానము తెలిసినవారని ఏవిధమున గుర్తింతుము ? మనమందరమును బ్రహ్మజ్ఞానము నెరిగెడు దేవిధము ? ఇట్లుండిన జనులందరకును దేశఅభిమానము మరపించిరిగదా ! జనులందరు ఒకటని మరచిరిగదా । ఎరిగెడు ఆత్మజ్ఞానము గురువులు మరచిరిగదా ! సోదర బంధుత్వము విడిపోయిరిగదా! మతవాదనచేపట్టిరిగదా! మతములలో చేరెరిగిన ప్రత్యక్షము ఏమిటి ? అందుచే పూజ్యతగలవారిని పూజించెడు జనులను మరిపించిరిగదా।

రెండవ ప్రసంగము :

భక్తుడువక పూజించెడు ఉత్తములందున, జీవితవృత్తియు, ధనమునకుదాచెడు యుక్తియు, ధనమునుకాపాడెడుశక్తియు దేవుని సృష్టిలో ఈనాలుగువిడచి ఏజనులును బ్రతుకరుగదా! ఇకరాజులు, ధనవంతులు, శాస్త్రజ్ఞులు సుఖజీవనమును కోరుటచే దుఃఖముచే జీవించెడు దరిద్రులుండక తప్పరుగదా! సుఖదుఃఖములగు ఈ రెండును కల్పితమతముచే బాధితులగు జనులందరు పాపముచే పుట్టితిరని, ఈజన్మమునను సుఖమెరుగరు మీరని తమతమ మతమును వ్యాపించెడు కోరికచే పరమతములనిందింపక మానరుగదా! తనమతమును ఘనమని చెప్పకమానరుగదా! ఇట్లు మానవకల్పితములు దేవునికల్పితమని దేవునిచేపంపిన శాస్త్రములని బహుయుక్తులచే బోధింతురుగదా। పాపముచేపుట్టిన నిరుపేదలు మాయాజ్ఞను పాటించినచో మరుజన్మమునను విద్యాధన సంపదచే పుట్టుదురని బోధింతురుగదా! ఇక మతశాసనమును పాటించనివారిని రాజాజ్ఞచే

దండింతురుగదా! దండన భయముండుటచే జీవించెడు దరిద్రదాసులచే మోసములేకను కాపాడెడువని మతగురువులు చేపట్టిరిగదా! వృత్తుల పేర్లను జాతులుగను మార్చిరి. జాతి పేరుచే వృత్తెరుగెడు విధమున పిలిచెడు పేరును కనిపెట్టిరి. కనిపెట్టినపెద్దలు సుఖజీవన కాంక్షను విడువరు. ఇక రానున్నది ముందెరింగిన శాస్త్రజ్ఞులు లేకుండగనుండరు. కానికానున్నది తప్పించుట ఏవేత్తలు ఎరుగరుగదా! ఇందుకువృత్తులచే జీవించెడు ఆర్యులకందరుకును కులవర్ణము జాతని పిలిచెడు వృత్తుల పేర్లెరిగెడు కొరకై ఎర్పరచిననామములివి. ఇందుకు వృత్తిని విడిచినజనులను ఏజాతికి జెందినవారిని ఎవరెరుగరుగదా! అందుచే భాషించెడు భాషచే ఆంధ్రులు వీరని పరులెరిగెడు విధమున ఎరుగుటకై ఏర్పరచిన మహాఋషివంశజులగు ఆర్యులు గల దేశమునను వృత్తుల పేర్లచే పిలిచెడుజాతులు ఆర్యులమని మరిచిరిగదా! మరచిన ఆర్యులు వృత్తుల పేర్లిడువక జీవించెడు నానాజాతులలో అధమోత్తమ మధ్యములగు జాతులలో ఒకరికి ఒకరు నిందితులై కలహములకు దిగివరమతముల పాలైరిగదా! కొట్లాదిప్రజలందున సుఖముగ జీవించెడు గురువులు దేశమునకు జనులకు దేవుని ఎరిగిన గురువులు జేసినఘనకార్యము ఏమిటి? ఇక ఆర్యావర్తనమున బాధ్యతగలపూజ్యులు ఇందెవరని ఎరిగెడు జనులకు మరపించిరిగదా! కలిగెడు కష్టమునకు అధమోత్తములందరు ఒకటిగ ఎరిగెడు బాధలు తప్పవుగదా! ఇందెరిగిన దేమిటి? మరియొక టేమనగా ముందుకుకలిగెడు దుఃఖములను పాటించని మతాధికారులు బోధించినబోధలు విన్నను వినకున్నను

దేవుని సృష్టిలో పుట్టినజనులందరు ఏనామముచేనైనను దేవుని తలవని వారుండరు. పరమాత్ముడు సర్వాంతర్యామని ఒప్పిన గురువులు అందరి భావము ఒకటనిఒప్పరు. ఇట్లొప్పని గురువుల దరిజనులన్నది ఒకటని వారొప్పరు. ఇట్లొప్పని జనులకు కనుగొనుటకు తెలియని దేవుడు ఈరూపమునకు గలడని శిష్యులు ఎట్లొప్పెదరు. ఇట్లు శిష్యులలో శిష్యులు గురువులలో గురువులు తగవులతో ఏర్పడు మోక్షద్వారము తెరచి ప్రవేశించెడు అధికారము మతములలో ఏమతమునగలదందురు ? ఈ బేధములగు తగవులలో పరలోకము వేరయ్యెను. పరమాత్ములు వేరయ్యెను. పాపులతీర్పిచ్చెడు ప్రభువులు వేరయ్యెను. ఆయామతజీవులు వేరయ్యెను. జాతులువిడదీసిరి. పరమతములపాలైరిగదా! ఈలోకమునను జనులకు జరిగెడు దెరుగని గురువులు పరలోకము జూపెదమని సమిష్టి జనులను విడదీసుటచే పతనము కాగలకార్యము జరిగినను మత అధికారము విడువని ఆంతర్యముచే అల్లినకథలెల్లను కల్పితమని వారెరుగుటచే మతములు ఒకటని మనుష్యులు ఒకటని అందరి భావము ఒకటని వారేనాడొప్పరుగదా!

## మూడవ ప్రసంగము :

ఇక పుట్టిన జనలందరు జీవితకార్యము యోచించని జనులుండరు. తమతమ శక్తికి తగినట్లుగా బ్రతికెడు వృత్తులు విడచిన జనులుండరు. దేవుని దేవతలను పూజించినను ఆకలితీర్చెడు తిండెన్నడు కార్యములేకను అనుకొనునంతలో ఏ నరులకు కలు

గదు. మహిమలు సాధించిన సిద్ధుల దరి తమ శిష్యుల ఆకలి అనుకొనునంతలో తీరినచో వంటలు వంటలు ఉండవు. ఏ క్రియ లేకను క్షుద తీరెడు పని జరుగదు. అందుచే కొందరు సుఖ జీవన శాస్త్రజ్ఞులు విద్యా మహిమచే భగద్భక్తెరుగని ప్రజలకు కల్పిత కథలచే ఒప్పించెడు అందముగల కల్పిత రచనల కావ్యమునందున గల మెప్పించెడు కథలను విని ఒప్పిన జనులందరు ఆనందింతురు. ఇక త్రిమూర్తులను వారుండెడు పట్నములను జూచెడు భాగ్యము లేకున్నను, హరికథ భజనలచే వినవడు ప్రత్యక్షముగని ఆనందింతురుగదా! ఇక ఇట్లానందించెడు మనమందరమును మనలోగల ఆత్మను ఏ విధమున గనుగొందుము. మరు జన్మము రాదని ఏ విధమున గుర్తింతుము. కల్పిత కథ ఇదికాదని ఎట్లందుము? దేవుని రూపము ఇదియని విగ్రహము జూపినచో విగ్రాకారము జగమంతటకలదని ఒప్పెదమా? లేక సృష్టికి కారణమగు పరమాత్మను జూచితిమని ఎట్లందుము. ఇట్లుండెడు దానందున పునర్జన్మ తప్పించెడువారిం దెవరు? వాడికివాడే సంధ్య చీకటిలో తాడునుగని పాముని అరచెను. అరచినదివిని ప్రాణము దీసెడు పాముని ఒకరిని ఒకరరచుచు ఊరును విడచిరి. సూర్యోదయమున తాడని తెలిసిరి. ఇట్లెరిగెడు అధ్యారోపముగల మతములలో జన్మలు తప్పించెడు మతాధికారిం దెవరని అడిగినచో అందుకు అధికారులు గురు శిష్యులు ఇరువురిలో వారికి వారే పెద్దలు. ఇట్లు ప్రతిమతములలో అధికారులు గురుశిష్యులు వారికివారే సాటి. మరి ఒకరుండరు. ఇక మరి వారెరిగిన ప్రత్యక్షము మరియొక రెట్లెరు

గరు. సముద్రజలము ఉప్పగనుండునుగదా! కనపడు నదిజలము తీపిగనుండునుగదా! ఇట్లగపడు జలభేదము ఎట్లొచ్చెను. అని అడిగినవారికి అగపడు జలభేదములకు కారణ కార్యము యెరిగించినచో ఏ జనులెరిగొప్పరు. ఏ స్వరూపము జూపించినను ఆ రూపము జూచెరిగెడు జనులకు పుణ్యముగల పరలోకము పాపముగల నరలోకము ఈ రెండితచేసిరి. ఈ రెంటిని పరిపాలించెడు పరమాత్మెందుండును? నరలోకమునను జీవులు చేసిన పాపము పుణ్యము ఈ రెండును లేకుండగ తీర్పెరిగిన జీవుడు ఏరూపమునను పుట్టును? ఇప్పుడు పరలోకము జూచెడు వారెవరు? జూచిన వారెవరు? ఇట్టి కల్పిత కథలచే జనులకు విజయము చేకూర్చినదేమిటి? ఇక సత్య మసత్యము ఈ రెంటికి హేతువ ఎరుగని సంసార కుటుంబ బాధలచే సంపద కలిగెడు కోరికచే పాపము పుణ్యము ఎరుగని జనులందరు దేవుని జూచెరిగించెడు భక్తిని బోధించెడు గురువుని దేవునిగను పూజింతురు. ఇట్లు పూజ్యితుడగు గురువుని దరి విద్యా వినయములును పొందిన పదుగురు శిష్యులు తనువిడచిన గురువుడు తరువాతను ఒకరికె కలిగెడు మతాధికారము పదుగురు శిష్యులు కోరిరి. విడువని స్వార్థ బుద్ధిచే పది మతములు ఏర్పరిచిరి. గురువుని దరి ఎరిగెన భావములను వేరర్థము గలదిగ చిత్రించిరి. మతకలహమునను శాస్త్రార్థము పొందించిరి. కలహములకు కారణ మెరిగిన శిష్యులు కలహించెడు స్వార్థము విడువరు. మోక్షముకొరకై వచ్చిన కోరిక మరచిరి. మరువని గురువునిపై అభిమానము విడచిరి. శిష్యులు సాధించిన ఫలమేమిటి? ఏ

సాధనలచే మహిమలు చూపింతురో అది గురువులు చెప్పరు. శిష్యులు అనుభవించిన దేమిటి ? మా గురువుకు మించిన అవతారులు లేరందురు. జీవుడు పొందెడు మోక్షము మాగురువుకుమించెవరును ఎరుగరు అని వాదింతురు. కాని మరణము తరువాతొచ్చెడు మోక్షము తానెట్లెరుగును. నేనెట్లెరిగెదనని చెప్పడు. ఇక బ్రతికుండగ ఎరిగిన మోక్షము, స్వర్గము, పరలోకము తనువిడచిన జీవులతో విన్నది ఎవరీజనులందున. ఇక గురువులు, గురుపుత్రులు విన్నది కన్నది ఎరిగానందించెడు కొరకై గురుపూజలలో వేదాంత మండలిలో, ఆత్మానాత్మ విచార నిర్ణయ వేదాంత సభలలో జీవన్ముక్తిని గోరెడు సాధనమగు మనసున వెలువడు మర్మము ఎరుగుటకై బహువిధ ప్రశ్నలుజేతురు. అందున కొన్నిక్కడ గురు మార్గాన్వేశకులకు గుర్తుకు తేనైనవి.

నాదొక మనవి వినుమని ప్రశ్నింతురు. నానారూపములగపడు ఈ రూపములన్ని ఏరూపమునుండేర్పడె. ఆ రూపము ఏరూపము నుండును ? అని ప్రశ్నింతురు. మరియొకరు జన్మలు ధరించు జీవుల కర్మ హేతువ ఎవరికి వారేనా ? లేక సృష్టంతటికి ఒకడేనా? మరియు రూపములను జేసెడు ఉపాధి విడచిన జీవుడును ఆత్మయు ఏ రూపమునుండును ? ఇక ఆత్మకు వేరుగ తనువులు విడచిన జీవులు పుణ్యము, పాపములు లిడువక పుట్టెడు జీవులు శాశ్వతమా ? ఆగంతుకమా అని ప్రశ్నింతురు. మరియొకరు పుట్టిన తనువుకు నాశనమున్నది గదా ! తనువున పుట్టెరిగెడు జీవునికిని నాశన మెట్లుండదు ? నాశనముండని ఈ జీవుడు దేనందున

పుట్టెను ? ఈ విధమున ఒకరికి తరువాత ఒకరడుగుచు నుందురు. మరి ఒకరిట్లనివింతురు. స్వామీ ! పుట్టెడు స్వభావమిడువని జీవుని పుట్టుగ తప్పించుటకగునా ? తనువుతో పోయెడు జీవుని స్వభావము జన్మకు రప్పించుట కగునా ? ఇందుకు మరియొకరేమందురు. పుణ్యము పాపము ముందింతుండినదని సాధించిన కర్మలచే పోయినదింతని గురుశిష్యులు ఏ విధమున కనుగొందురు. మరియు పుట్టినవాడెరుగని జన్మము మరిలేదని చెప్పుటకన్నను నీకిక మరణము రాదని బోధించిన విను జనులందరు ఆనందింతురు గదా ! మతగురువులు ఎట్లెరుగరు ? మరి ఒక మనవి ఏమనగా వెనుకటి భార్యా బిడ్డలు, సంపద, భాషా మతజాతి, జ్ఞానము ఈశ్వర సృష్టిలో జన్మించిన ఏ జనులెరుగరు. ఇక గురువులు ఎరిగించిన దేమిటి ? ఇక మోక్షము స్వర్గము జూచెడు కోరిక ఎవరికి ? మరియు బహు రూపములను ధరించు పదార్థమగు ఉపాధి ఒకటి ప్రాణముగలదిగ తెలిపెడు చైతన్యము మరియొకటి ఈ రెంటిలో విశ్వవ్యాప్తమై శాశ్వతమగునది పదార్థమా ? చైతన్యమా ? పదార్థ చైతన్యముగానిది మరియొకటేమున్నది ? అది ఏ విధమున గుర్తుకు తెత్తురు ? మరికొందరు అద్వైతముగల ఆత్మందున ద్వైతముగల జగముండగ ఈ రెంటిలో అద్వైతము ఏదందురు ? మరియు చీకటి వెలుతురుకానిది కదలని పరిపూర్ణ అచల బ్రహ్మమునను ఏ సాధన నొల్లని ధీమంతులు మరి ఏసాధనచే గుర్తింతురు ? కొందరు మరి ఇట్లందురు. చలనము ఎరుగని స్థలమున చలనముచే కల్పిత జగమున పుట్టిన జనులకు జననము, మరణము

 

సుఖ దుఃఖములెరుగని శాశ్వతరూపము ఈ రెంటిలో దేనందున గుర్తింతురు ? మరియు పేరునపిలిచెడు దేవునివిగ్రహము అంతట నుండదుగదా! లేక విగ్రహ దర్శనజేసెడు వానిలోగల ఆత్మంతట నుండునదా ? ఈ రెంటిలో ఎట్లెరిగిన అంతటగల దాత్మను నెరి గెదరు. ఎరిగినవారగుదురు. మరియు బయలందునలేనిది ఉన్నది యని ఎవరును చెప్పరు, గాని భూతము లైదందున బయలేవిధమున గలదను అనుభవ జ్ఞానము సూక్ష్మజ్ఞానుల ఊహను తెలిసెడుదై యున్నది. అది ఏరీతున గుర్తుకు తెత్తురు ? మరి కొందరు ఈ విధమున ప్రశ్నింతురు, కలలో దొరికిన ధనమునుచూచి ఆనందిం చెడు మనస్సు మేల్కొని కల కల్లని తనకైతానెరిగెను గదా! జూచిన కల మనసున మరువక యుండెనుగదా! కల మరువని మనస్సు మరి యేమేల్కొచే మనసే మరిలేకుండగ నుండును. ఇట్లెరుగుటచే మరు జన్మము ఉన్నది లేనిది రసగుణ పదార్థ విమర్శన లేనిదే నిజమెవరెరుగుదురు. ఇట్లు తెలిసెడు మనస్సును మరిపించెడు సాధనలందున సత్యాసత్యము ఆసలెరుగరు. ఇందున గల విశేషమేమనగా కారణ కార్యము రెండొకటైయుండెడు. ఈశ్వర భ్రమచే కలిగిన చలనమునను చలియించని దానందున కలిగిన సంపదనంతయు, ఈశ్వర ఆశ్రయ ప్రకృతి కార్యమునకు ప్రాణము గల భూతము లైదందున ప్రాణముగల తలిదండ్రుల మూలమునను పుట్టిన జనులందున వారివారి తలితండ్రులకును కలిగెడు సంతా నము పెరుగుచునుండగ పోయెడు జీవుడు మరలొచ్చెడు పని ఏమున్నది. "కారణగుణ పూర్వక కార్యగుణోద్రష్ట" అను న్యాయ

తెలిపెడు శబ్దార్థము శబ్ద ఉపాధి ఉన్నను. అందున అర్థముగల శబ్దము తనువున జేసెరిగెడు క్రియ ఏవిధమున జరుగును ? ఈ హేతువుచే తనువును విడచిన నేనను భ్రమగల జీవుడు మరియొక తనువును ధరించు పెట్లగును. అందుచే కారణమగు ఈశ్వర మాయా ప్రకృతి కార్యమునకు పుట్టిన జడచేతన జనులందరు జీవించెడు జగమును అశాశ్వత మాయా జగమందురు గదా ! ఇక మాయను విడువక కోరెడు మోక్షము మాయలోనిదది కాదా ! మాయను పుట్టెరిగిన జ్ఞానులు మాయను నిందించుట తప్పని చెప్పుట తప్పా ? ఇక మాయా ప్రకృతి నందున పుట్టిన జనులను యిడువని కర్మలచే పుట్టెడు జన్మలు తప్పుటకై సాధన జేసెరిగెడు జ్ఞానము మాయను కలిగినదది కాదా ! మాయకు వేరనిచెప్పినవారికి తప్పని చెప్పిన తప్పా ? మరి పదార్థరుచి వేరుగ విడదీసినచో నాలుక రుచి ఎరుగని విధమున తనువును విడచిన జీవుడు మరి జన్మించెడువాడని వ్యాపకమగు జీవునికొప్పించిన గురువుల మాటలో సత్యములేదని చెప్పుట తప్పా ? మరియు పాపము పుణ్యము తీరెడువరకును జన్మించక తప్పదు. జీవులకని ఒప్పించిన గురుదేవుని సామీప్యము; సారూప్యము, జీవన్ముక్తియు పొందెడు మోక్షము కలదని చెప్పొప్పించుట తప్పని చెప్పినచో తప్పేమున్నది ? మరియు దేవుని తీర్పుచే కర్మము తీరిన తరువాతను జన్మము గలదందురుగదా ! ఇక కర్మముచే పుట్టెడు నరులందున ప్రతిరోజును లక్షలాది ప్రాణులు పుట్టును. మరి వీరందరు దేవుని తీర్పుచే పుట్టినవారని ఒప్పెదరా ? దేవునికొక పని కల్పించిన

గురువులమాటలో సత్యములేదని చెప్పుట తప్పేమున్నది, మరియు నా వెనుకటి జన్మము నే నెరుగను. ఇప్పుడు పుట్టిన పుట్టుక నే నెరుగను. నావలె పుట్టిన దెరుగని నీవు నాపుట్టుక నీవెట్లెరిగెదవు ? ఇక పుట్టవు నీవని బోధించెడు గురువుల ఆంతర్యము బూటకమని చెప్పుట తప్పా ? మరియు తలచిన కోరిక ఒకటి కనవడురూపము మరియొకటి కనవరచిన రూపము ఇంకొకటి తలచిన కోరికయందు ఈ మూడొకటై ఎరిగెడు ఎరుకై ఎరిగెడు స్వశక్తి రూపము కోరెడు మనసును ఎరుగక మోక్షము కోరుట తప్పని చెప్పుట తప్పా ? మరియు నానామత శాస్త్రజ్ఞులు గనుగొనగల పరమాత్మను గురువులు అందరు ఒకటై ఎరుగని వరకును స్వజాతి జనులను విడదీసెరిగించెడు గురువులు బోధించెడు మతములో సత్యము లేదని చెప్పిన తప్పేమున్నది ? ఇక ఇట్లూహింతురు జనులందరి యందున సమదృష్టి యెరుగని గురువులు బోధించెడు బోధలచే దేవుని ఎరిగిన వారిని పూజించెడు జనులకు గల ఫలమేమిటి ? దేవుని వరమున వంపిన మతగ్రింథములని చాటింతురుగదా, ఇందుకు వరమాత్మని వక్షపాతిగా అనేక పరమాత్మల జేసిరి. గురువుల భావము ఒకటై ఎరుగని వరకును జనులను విడదీసెరి గించెడు విప్లవ మతములు బోధించుట తగదని ఎరిగిన వారికి చెప్పుట తప్పేమున్నది. ఇక మత అభిమానముచే కలహించెడు గురువులు, శిష్యులు, అవతారులు, రాజులు, ప్రవక్తలెందరో మరణమునకు తరువాతను మరియాజీవులు ఏలోకమునున్నది ఏమైరో ఎవరికి కనవడి ఎరుగరు. మరి పుట్టెరిగించరు. మాపుట్టుక

ఎరుగని గురువులు పుట్టెదరని చెప్పుట తప్పని చెప్పుట తప్పా? భ్రమచే పుట్టి నశించెడు దెరుగని చైతన్యము ఒకటి పుట్టి నశించెడు ఉపాదాన పదార్థము మరియొకటి ఈ రెండొకటై పుట్టిన తనువున పుట్టిన జీవుడు తను విడచిన తరువాతను సంచిత మిడువని జీవుడు ప్రారబ్ధము తీరెడు వరకును ఉపాదిలేకను పుట్టుటకొరకై ఎట్లుండును?

ఐదవ ప్రసంగము :

ఇక మరియొకటేమనగా దేవుని సృష్టిలో జీవులు వారికి వారే పుట్టెడు స్వాతంత్రము కలదా? మరియు తలిదండ్రులు లేకను సప్త ధాతుశరీరము విడిచెవ్వరైనపుట్టెదరా? ఈశ్వరజీవుల వలెతో చెడుతనువులలో ఈశ్వరుడువిడిచుండుట కగుగా? చలన రహితమగు బ్రహ్మములేకను చలనముగల బ్రహ్మము పుట్టుట కగునా? ఇక నిర్గుణ సగుణము పోలికలందున స్వరూప స్వభావ గుణమొకటగునా? ఇక నిర్గుణమందురు సగుణబ్రహ్మమునా? లేక చలన రహితమగు బయలా? మరియు రూపములగపడు సృష్టం తటవ్యాపించిన చైతన్య బ్రహ్మనను సృష్టికివేరుగ విడదీసెరిగెదరా? జగమేర్పడునంతటి ఆకారమునకు కదలని బయలుండక కార్య బ్రహ్మముచే సంపదగల సృష్టిగునా? మరియు ప్రాణముగలజీవులకెల్లను పోషించెడు పానకుడగు పరమాత్మని నిర్గుణమన చెప్పుట ఎట్లొప్పును? కార్యబ్రహ్మమునకు నిర్గుణ బ్రహ్మమునకు ఈ రెంటికి పోలికలేనాడును ఒకటిగనుండెడివా? కార్యబ్రహ్మము నిర్గుణమెన్న

డుకాగలడా? నిర్గుణబ్రహ్మము కార్యబ్రహ్మముకాగలడా ? ఇక ఇందు సుఖదుఃఖము లెరుగని బ్రహ్మము ఏదందురు? ఇక నిర్గుణ సగుణము రెండుకతోచెడు పాలకుడగు పరమాత్ముని యందున పాలితులగు జీవులు వర్ణము లిడువక పుట్టెరిగెడు పూర్వ జ్ఞానము తెలియనిజీవుల పుట్టించుచే గుణవులవెక్కువశ్రమయయ్యెను. ఎందులకనగా ఎజాతివిత్తనములు ఆజాతివృక్షములై పుట్టునట్లు ఏవర్ణ జీవులు ఆవర్ణములో పుట్టునట్లుగా నియముండినచో ఆవర్ణపుజీవులు వృత్తి జ్ఞానము మరువకయుండినచో ధర్మ సంకరముగాకుండును గదా। ఇక దేవుడు మొదలెరిగుండెనేని విడువని వర్ణఆధిక్యత కోరెడు పండితజనులకు అన్యోడుమేలు స్థిరముగ నిలచుండును గదా। కాని అట్లుదేవునిచే జరిగెనేని ఏవర్ణపుజీవులు ఆయావర్ణము లిడువక పుట్టుటచే ఉత్తమ కులవర్ణము జీవుడు వర్ణసంకరము గాపుండునుగదా! అట్లుజరుగనందున జన్మించిన జీవులు వెనుకటి జ్ఞానము లెరుగక పుట్టుటచే ఉత్తములందున అధములుపుట్టిరి. అధములయందున ఉత్తమజ్ఞానులు పుట్టిరి. ఇట్లు పుట్టుటచే వర్ణఆధిక్యత ధర్మము సంకరముగుచున్నది గదా! అందుచే దేవునిలో వర్ణము లిడువని మతశాస్త్రజ్ఞులకందరకును కలిగిన పనిచే మతమును నమ్మని వారికి పాపముగలదని వర్ణములిడచినవారికి దుర్గతిగలదని బోధించెడు శ్రమగలిగెనుగదా! వర్ణములందున వినినమ్మిన జనులందరు సమిష్టి ఎరుగక అల్లరిపాలై జీవించెడు వారైయ్యెను గదా! ఇక తమలోతాము మతఅల్లరిచే జీవించెడు జనులందున పుట్టిన పిల్లలు తినిపెరిగెడు కొలధిగ వారిజీవితము వర్ణమునకు

మునకు కారణమందున ఏగుణములు కలిగుండునో అదియే తలి దండ్రుల కార్యమునకు పుట్టిన సంతానముచే మిగిలిన కార్యము జరుగుచునుండును. అందుచే తనువుని విడచిన జీవుని బ్రిమ మరి పుట్టుటలేదని తెలియుటే ఇందునగల విశేషము.

నాలుగవ ప్రసంగము :

ఇక మొదలీ ప్రపంచమంతయు అజ్ఞానమువలన జనించిన ఈశ్వర భ్రాంతే ఇందుకు కారణమందురు కదా ; ఇక జడచేతన రూపములేర్పడుటకు ఈశ్వర భ్రాంతేగదా కారణము. క్రియగల భ్రాంతికి హేతువ చైతన్యాశ్రయ మాయా ఉపాదినంతటగల జీవ భ్రాంతేగదా హేతువ. ఈశ్వర ఉపాదిచే కలిగిన భ్రాంతనునది ఏమిటి ? అది ఘనపదార్థమా ? చేతనమా ? అణువుగ నుండెడిదా? జీవపదార్థము మితమగు ఏరూపముననుగల దందురు ? ఇందుకు మరియొక టేమనగా చెలియించెడు క్రియమూలమునందున తోచెడు భావమునను వెలువడు కోరిక రూపములకు రూపము తేర్పడుచుం డెడు ఈశ్వర కోరికనందున కోరెడు మరియొక ఈశ్వరుడుండడు గదా ; అట్లు తలిదండ్రుల కోరికచే గలిగెడు పుత్రులు, పుత్రుల కోరికచే గలిగెడు మనమలు, మనమలకోరికచే విడువక పుట్టెడు కోరికచే తనువులు పుట్టుచునుండగా తనువిడచిన కోరిక మరి ఏకార్యమునకు పుట్టును ? మరియు కోరికచే వెలువడు శబ్దార్థము మరి కోరికతో చేరని విధమున ఈశ్వర సంకల్పముచే కార్యము లకు కారణమగు తనువును విడచిన కోరిక నందునగల భావము

రుగరు. నరులకు జన్మించెడు జన్మలు నరులెరుగుదురు. ఎరిగిన నరులందరు సృష్టికిహేతువ గలడొకడని ఎరిగిరి గాని ఎరిగినవారందరు పాపము చేపుట్టినవారని ఎట్లందుము? ఈ పాపమునకు హేతువ పరమాత్మందుమా? అట్లైతె సృష్టికిహేతువగల పరమాత్మెంతటి పాపముచే నానాజన్మములందున నానారూపములై పుట్టెను. నానాజన్మలుధరించి పుట్టుము నీవని శాసించిన తీర్పేప్రభువిచ్చెను. వ్యక్తముగాని ఈశ్వరసంకల్పముచే ఏపాపము ఎరుగని జీవుల ఆకారమునకు ఈశ్వరుడే విధమున జీవుల కన్యముకాగలడు. ఇక ఈశ్వర ఆశ్రయ మాయామూలమునను పుట్టిన నానారూపములందున రూపములను రూపములిడువక పుట్టెడువాటికి పుట్టుకలిడువక పుట్టుచునుండగ గిట్టెడు వాడిక ఏరూపమునను పుట్టును? విత్తనములుకాచి ఎండినరించిని చెట్టు వృధిపందుండినను వృధివెన్నడు బ్రతికించదు, పోషించదుగదా కార్యము తీరిన తరువాతను తనువిడచిన జీవుడు భూతములందున పోషింపబడడు. జీవులు ఎప్పుడు వ్యాపకమగు ఆత్మకువేరై ఉండరు. జీవుని విడచిన తనువెన్నడు ఆత్మననొప్పదు. ఆత్మకు వేరుగాజీవుడు పుట్టినచో తనువు తొనాశనమొందక తప్పదు. ఈమర్మము ఎరుగక తర్కముచే గనుగొనజాలరు. మరియు దేవునిచేసృష్టించిన వర్ణములని తెలియని జనులను దాసులజేసెరిగించెడు శ్రమపడి వ్రాసిన కథలచే ఒప్పించుట కన్నను వెనుకటి సంసారము పుట్టెరిగెడి జ్ఞానము తెలిసుండినచో వర్ణసంకరము ఎనాడును గాకుండును గదా! ఆయావర్ణము జీవులు తమతమ వర్ణములందున తప్పక పుట్టినచో ఏబాదెరుగక

ఆశించెడు పెద్దలకందరకును కలిగుండునుగదా : ఇక మరణము నకు తరువాతను వర్ణము విడువనిజీవులు మరలొక గర్భమునను పుట్టెడు వానికి వెనుకటి సంసారము ఎరిగెడు జ్ఞానము పుట్టిన నరులందరకును ఎరుకై యుండినచో తమతమ వర్ణము విడువక పుట్టినచో వర్ణము తప్పేజీవుడు పుట్టడుగదా ! ఒకవేళ పుట్టినచో ఉత్తమవర్ణస్థులు చంపక మానరు. బహుజాతులకివ్వక తప్పదు. దుర్దిన నక్షత్రమునందున పుట్టిన శిశువును పాలించెడు పెద్దలు వర్ణముతప్పేజీవుడు పుట్టినచో వర్ణసంకరమునను ఒప్పెదరా ? ఇక సంకరమొప్పని ఉత్తమ వర్ణములందున ఉత్తమవర్ణపు జీవుడు పుట్టెరిగిన కొలదిగా వెనుకటి భార్యా బిడ్డలు, సంపద స్మరణకు వచ్చుటచే తలచు ఏడ్చును. ఇట్లెడ్చెడు పుత్రుని జూచి తలిదం డ్రులు ఎందుకేడ్చెదవందురు. అందుకు పుత్రుడు వెనుకటి సంసారము జరిగినదంతయు చెప్పక ఏడ్చును. ఇక జనులందరి పుట్టుగ ఇట్లుండినచో వెనుకటి జ్ఞానము ఎరిగుండినచో వెనుకటి సంసారము ఎరిగేడ్చుటచే తలిదండ్రిల పుత్రిల అభిమానము ఏ మగునందురు. ఇక ఈ సంసారమునకు బాధ్యతులెవరై యుందురు. వెనుకటి జన్మము తెరిగి పుట్టినవారికి ఈగతిపట్టక మానదు. ఒక వేళ వెనుకటి సంసారము గనుగొనగలిగినను నీభర్తనని చెప్పి ప్పించినను బహురీతుల మెప్పించినను సంపదగుర్తుకు తెచ్చినను భార్యాప్రాయము ఆరవది ఏండ్లది, భర్తను నేననువాడిది పది ఏండ్లుండును. ఇకప్రాయము రూపము కలువదు. ఆగ్రామపు జను లందరు భర్తని చెప్పిన ఒప్పరు. ఇట్లుండుటచే తలిదండ్రిలపై

అభిమానము లేకుండెడు సంకరజాతేర్పడుగదా। వెనుకటి సంసారము ఎరిగెడు జ్ఞానము. గలిగినగతి ఇట్లుండును. పండితులెరుగరు. ఇక పండిత కుటుంబములందున పండిత జనులందరు పండితులై పుట్టరు. అవతారుల కవతారులు పుట్టరు. భక్తులే పుట్టరు. శూరుల కెవ్వరును శూరులుపుట్టరు. వ్యభిచారమునకు పుట్టును. పూజ్యులు, మార్గదర్శకులు, మహావీరులు, ఇంతకు వీరెరిగినదంతయు సత్యమైకుంట కైలాస పరలోకము, తనువిడిచిన తరువాతెరిగెడు మోక్షము కలదని నమ్మింతురు. ఇక అందరు ఒకటని ఎరిగెడు మోక్షము కొందరు ఒప్పరు. మరియొకటేమనగా ద్రవరూపము నుండెడు బిందువునను తలిదండ్రుల కోరికలకు తగినట్లుగా ఏర్పడు తనువున ప్రాణమునను గలిగి ఎరిగెడు మనసు తనువును విడచిన తరువాతను నానాతనువులలో వ్యాపించిన ప్రాణముగల వాయువు విడివిడి ప్రాణముగల జీవుల ఆకారమునను ఉండనివని గనుగొనువిధమున తనువును విడచినజీవులు నానాజన్మములందున కర్మముచే పుట్టెడు జీవులు వేరైపుట్టెడు స్వభావము వ్యాపకమగు అద్వితీయ చైతన్య బ్రహ్మమునకు జీవుడుగా పుట్టెరిగెడు కార్యము చైతన్య బ్రహ్మమునందున కలుగదు. ఇట్లు తత్వ విమర్శకులెరిగెడు ధర్మము కలహించెడు స్వార్థులు ఎరుగరు. మతకుల సంకరమగు భయముచే జీవించెడు పెద్దలు అధికారము విడువని గురువులు పునర్జన్మము గలదని ఏ విధమున ఒప్పింతురు. పుట్టినవానిని పుట్టెడువానిని, పుట్టుదురని ఏ విధమున చెప్పొప్పింతురు. సృష్టిని విడచి ఏనరులును పుట్టరు. పుట్టిన ఇంద్రియ నరరూపము నందున

సర్వము గుర్తెరిగెడు మనసుకు వేరుగ మరియొక టెరుగరు. ఈశ్వరునందున నేనుంటిని నాలో ఈశ్వరుడుండెను అని పలికెడు మనసునకా మోక్షము, లేక చైతన్య బ్రహ్మమునకా, బ్రహ్మము నిడువని మాయా ఉపాదికా. ఇందున మోక్షము దేనికి ?

ఏడవ ప్రసంగము :

మరియొక టేమనగా చలనరహితమగు బ్రహ్మమునందున చలనసహితమగు ఈశ్వర ఉపాది ప్రకృతి కోరికచే తోచిన జగమున కల్పిత స్త్రీ పురుషుల పుట్టుగ మూలము వీరెరుగరు. వీరికి పుట్టిన సంతానము తలిదండ్రులె కారణమని ఎరుగును. మానవ రూపములిడువక పుట్టెడు కోరిక మూలము వీరివురు ఎరుగరు. మరియు ప్రాణముగల ఇంద్రియ తనువులలో వెలిగెడు ప్రాణుల వెలుగుకు వెలుగొసిగెడు శక్తగు వెలుగందరియందున ఒకటని ఎరుగరు. సూర్యునిబింబము నిండిన నీళ్లతో ఉండిన ఘటములలో సూర్యుని ప్రతిబింబములకు గలదొకటని తెలియని విధమున మహాకాశంబను బ్రహ్మము మేఘాకాశమునను కలిగిన ప్రతి బింబము ఈశ్వరుడని ఉత్తమ పురుషునిగను ఎరుగరు. ఇక ఈశ్వరుడను బింబము జలమున ప్రతిబింబించుటచే జీవుడు అక్షర పురుషుడుగను ఎరుగరు. ఇట్లెరుగని స్త్రీ పురుషులు పాప మునను పుట్టితిరని శాస్త్రానుమానము పాటించిరి. మానవులై పుట్టెడు కోరిక మొదటీశ్వర కల్పితమును మరపించిరి. ఇక ఈశ్వర ఉపాధి స్వశక్తి కోరికచే కలిగిన స్త్రీ పురుషులు కనగల

సంతానము కార్యము తీరిన తరువాతను ప్రాణము విడిచిన తను
వున మరి కార్యము జరుగదు. వ్యాపకమగు ఆత్మను విడచిన
జడసాధనమగు మనస్సున క్రియ జరుగదు. మరిజన్మించెడు
కార్యములేవిధమున జరుగును. సర్వజ్ఞుని కార్యము కన్యము జన్మి
ంచెడు స్వతంత్రము జీవులకుండదు. జన్మించెడు వాడెరుగడు తన
వెనుకటి జన్మము. మరణను తరువాతొచ్చెడు జన్మము ఎవరెరు
గుదురు ? ఇక జన్మము గలదని శంకించెడు పని ఏమున్నది ?
ప్రాణము విడచిన శరీరముంచరు. ఆత్మను విడచిన మనసును
ఎరుగరు. రెండుండక పుట్టెడు కార్యము జరుగదు. ఇక ఎరుగక
జేసినపాపము పుణ్యము అనుభవించెడు వారెవరని సందేహింతురు.
ఇందుకుఫలములు కాచిన వృక్షమునకు ఫలములు గనపడునట్లుగ
తలిదండ్రుల కోరికచే వెలువడు బింధువు నందున తలిదండ్రుల
పోలికగల పుత్రులు జేసెడు మంచిది చెడ్డది తెలిసిన జనులు చూచి
ఆనందింతురు. ఇట్లు తలిదండ్రుల మూలమునను ఒకరిని ఒకరిడు
వక నరులై పుట్టెడు సంతానమునకు హేతువ ఈశ్వర ఉపాధి
మాయాప్రకృతి కోరికే సృష్ఠంతటికేతువ, గుర్తించిన తత్వవిచారక
జ్ఞానులు తెలియకమానరు. ఇక ద్రవమగు మధురము వ్యక్తము
కాకను, ద్రవమును విడచుండదు. మధురము. అట్లు తనువును
పోలుండదు కోరిక కోరికనకు పోలుండదు జ్ఞానము. జ్ఞానమునకు
పోలుండదు తెలివికి పోలుండదు మనస్సు. ఇట్లు నెమిలండము నుం
డిన ద్రవమొక రూపము అందుండిన నెమిలా కారము మరియొక
రూపము నెమిలాకారముగల జీవుడు అండమునను ద్రవమంతటను

నిండినదై జడచే తనమును ఈరెండొకటై సప్తధాతు పరిణామమునను సుందరమగు రంగులచే నెమిలై ఎగిరెడు విధమున ఇట్లయ్యెడు ప్రకృతి మాయెవరెరుగరు. ఇక మనియను ఉపాధి లేకుండిన వ్రాసెడు చిత్రరువులు కలుగవు శబ్దము అర్థము రెండొకటై యుండక స్వరూపమెరుగరు. అట్లుమాయను పదార్థము గుణమను చైతన్యము ఈ రెండుండక పుట్టెరిగెడు కార్యము జరుగదు. మరియు కార్యముచే పుట్టెడు రూపము రెంటిచే అయ్యెడు కార్యము లేకను ఒకటిని మరియొకటెన్నడు పుట్టించదు. బ్రమమూలమునను తోచెడు కోరిక రూపము ధరించి తెలిసెడు మనసుండక మూలముగల బ్రిమ భావము తెలియదు. తెలిపెడు మనసుకు భాషా ఉపాధిలేకను తనువునుగల పెదవులు కదలవు. కదిలెడు తనువుకు కారణ కార్యము ఒకటై యుండిన తలిదండ్రుల బింధువు లాకారముకానిది మరియొక మనిషాకారము ఏర్పడినదికదా। ఇక ఇరువురి కార్యమునను కలిగిన తనువున కలిగిన జీవుడు తను విడిచిన తరువాతను మరలెట్లొచ్చును? సూర్యుని ప్రకాశమందున జీవించెడు జనులందరు సూర్యుని కాంతిని విడచేసి వేరుగజేసెడు దెరుగరుగదా! అట్లు వ్యాపక చైతన్యమునను జీవులుగను విడదీసి వేరుగజేయుట కగునా? ఈ తాజ్ఞానమునను ఆత్మకు జీవులు వేరై యుండరు. వేరుగపుట్టరు. ఆత్మాశ్రయమున పుట్టినశించు తనువుల పోలుండదు ఆత్మ. తనువుతోజేసెడు కార్యము తీరిన తరువాతను తనువెన్నడు పుట్టదు. ఆత్మెన్నడు జీవుని పుట్టించదు.

## ఎనిమిదవ ప్రసంగము :

ఇక మాయా ప్రకృతి కార్యము విడచెప్పుడు చైతన్యము తన రూపమునకు వేరుగా స్వతంత్ర జీవులు గలదై పుట్టదు. మరియు ఇరువురి కార్యము జరుగక ఎవరును పుట్టరు. పుట్టినను తన పుట్టుగ తానెరుగదు. బహురూపములగు జగదాకారము ధరించు బ్రహ్మము జనులాపదలందున అవతారములై పుట్టుట తప్పదుగదా ! అందుచే జనులందరు దేవునిగను పూజింతురు. జీవులు ఎన్నడు ఆత్మను విడచేనాడును స్థిరముగ నుండెడు జీవులు పుట్టవు. పుట్టిన తనువుతో నశించును. ఇక పుట్టినవారిని, పుట్టిరి మావారని ఎవరుచెప్పి ఎరుగరు. పుట్టినవారిని పుట్టినవారెరుగరు ఇక పుట్టుదురని ఎట్లందుము ? ఇందుకు మరియొకటేమనగా భూతములందున గుణములుగల తన్మాత్రలు ఒక పోలికనుండవు. మహాభూతములందున పుట్టిన ప్రాణులు ఒక పోలికనుండవు. జలమున జలచరములు ఒకపోలిక నుండవు. వృక్షము పోలిక విత్తనముండదు. తలిదండ్రుల పోలిక బిందువులుండవు. బిందువు పోలిక పుట్టిన శిశువుండదు. రుధిరము పోలిక క్రిములుండవు. చైతన్యము పోలిక మనసుండదు. తెలివియు, జ్ఞానము, మనసును ఒక పోలికనుండవు. ఈ పోలికలందున తెలిసిన మనసేపోలిక నుండునో మనసెరుగదు. మరణము తరువాతను జన్మెట్లెరుగును ? జన్మకు మూలము పదార్థగుణములు చేరయ్యెడు తనువున తెలిసెడు జ్ఞానమునకు జన్మము గలదని చెప్పిన ఒప్పెదరా ? పిచ్చి, మూర్ఛమనసునకు రక్షించెడు రోగపు బాధలచే తన్నుతానెరుగని

మనస్సు జన్మకు కారణమని చెప్పినచో మోక్షము కోరెడు వారెవ్వరు ? జీవుడు శాశ్వతమని చెప్పినచో బహు జన్మలు ధరించు వాడని ఒప్పినచో జీవుని స్థిరమగు భాషాజ్ఞానము జీవుడు ఎరుగడు. పుట్టిన వారందరు ఎప్పటికప్పుడు నేర్చెడు భాషాజ్ఞానము ఎరుగుచునుండగా జీవుడు శాశ్వతమని ఎట్లందుము ? ఇందు జన్మము దేనికి ? ఈశ్వరసృష్టిలో కార్యము చేపుట్టును కార్యము తీరిన మరికనుపించకపోవును. ఇందుకు జన్మముకలదని విచారమెవరికి? సుఖముగ జీవించెడువారు బోధించెడు సంశయములు బోధించక జీవిత మెప్పుడు గడువదుగదా !

ఇక ఈబేధము లిట్లుండగా సప్తదాతువులందున పదార్థగుణ పోలికలు ఒకటిగ నుండనిదానందున ఏర్పడు తనువున ఎరుగెడు మనసు ఏధాతువునను కలిగినదో మనసెరుగదు. సాధనమగు ఈ మనసును ఉపయోగించెడు హేతువుగల కారణమూలము తనువున గల మనసెరుగదు. మరి పుట్టుట మనసెట్లెరుగును ? ఇక రూపము గల సృష్టంతట వ్యాపించిన జీవముగల చైతన్యము లేకను ఏ రూపములును కలుగవు. అందుచే మనసున విని చెప్పెడు కార్యము జరుగుచున్నది. శరీరమిడిచిన మనసేమగునని అడిగినచో మాయావృత చైతన్యము సందున జడఉపాధి నుండెను మనసెరుగకపోవును. ఎరుగని పరికరమగు మనసుకు జన్మ స్వతంత్రమెట్లొచ్చును. మరియు బాల్యయవన కౌమారములందున జేసిన పనులెన్నియో తనువున్నప్పుడు జ్ఞాపక మొచ్చునుగదా। తనువిడచిన తరువాతను పుట్టిన వారెవరును ఎరుగరు. ఇక వెనుకటి జ్ఞాపకము

పునర్జన్మ గలదను వాదముతో అంతర్యమెమిటి ? తానుండగ తను గను సంతానము పునర్జన్మ గలిగినదని నమ్మాడమా ? లేక గురు వుల కిచ్చిన దానముచే మరియొక ధనికుని ఇంటను పుట్టుదురని నమ్మడమా ? కర్మమార్గమున కలిగిన సందేహమును బ్రహ్మ జ్ఞానులు ఏవిధమున గుర్తుకు తెత్తురు ? ఇక కర్మముచే కనపడు బహువిధ బేకములగు రూపములందునగల జీవులు ఒకరూపము మరియొక రూపమునను ఆకలికై చంపుక తినుచుండును గదా ! తిని బ్రతికెడు జీవుల స్వజాతి వైరమునకు కారణరూపము ఏ రూపమునుండునో ఎవరెరుగరు. ఇక ఇట్లు తిని జీవించెడు జీవులు ఏపాపములేకను చచ్చిన జీవులతో చచ్చెదమని భయము లేకను నిర్భయముగ జీవించెడు జనులందున ప్రతిరోజున కోట్లాది ప్రా ణులు ఆకలికై చంపుక తిందురుగదా !

ఇక కర్మకు తగు జన్మలు ఎత్తెడు శాస్త్రజీవులు గుర్తెరి గెడు జ్ఞానము ఉండినచో అన్యాయముజేసె నరులని గుర్తెరిగినచో చంపుకతిని బ్రతికెడు వారందరు ఏమై యుందురో ఊహించెడిది. ఇక ఇట్లెరుగని జీవులకును దేవుని దరి తీర్పెట్లిత్తురో ఎవరెరుగరు. చైతన్యము, శరీరము, జీవుడు, ప్రకృతి వేరుగ జేసినచో అద్వైత ముగల చైతన్యము ఎట్లుండును. తత్వమసి యను శబ్దలక్ష్యము నేనని చెప్పెడు మనస్సు ఎప్పుడు లేకుండునో, జీవేశ్వరులు ఒక టగు లక్ష్యము ఇందేది ? ఆకలికై చంపిన జీవులు, చచ్చిన జీవులు, పుట్టిన జీవులు చైతన్య బ్రహ్మమునకు వేరుగ ఎట్లుండును అద్వితీయ చైతన్య బ్రహ్మము ఎట్లావ్వును ? తెలిసిన ప్రత్యక్షము

అందరు ఒకటిగ నుందురుగదా ? కొందరు సాధనలొప్పరు. మరి కొందరుపాసనలొప్పరు కొందరు మహిమలొప్పరు. అందరు జూచినదొకటని ఎట్లొప్పును. ఒప్పని ఈ మనసును కదిలెరిగించుటచే కదిలెడు మనసును తనమూలము తానెరుగదు. ఇక జన్మము దేనికి ? ఇక పుట్టిన జనులందరకును ఒక హేతువు లేకను ఎవరును పుట్టరు. మనకై మనమెన్నడు పుట్టము లేక తలిదండ్రుల కోరికచే పుట్టిన మన పుట్టుగ మన మెరుగక పుట్టితిమి. పుట్టి జేసిన కర్మముచే బహుజన్మలు ఎత్తెదవని గురువులు బోధించుటచే కలిగిన అనుమానమువల్లను పీడితులగు ప్రజలకు ఈ అనుమానము తీరెడు మరియొక రహస్యమేదైనను గలదాయని ప్రశ్నింతురు ? ఇందుకు సాధువులెరిగిన అనుభవ రహస్యము గుర్తుకుతెత్తును "శబ్దైకాకాశస్య" అను న్యాయముచే ఆకారమునకు రెండు స్వభావములు గలవు. ఒకటి అవకాశము అనగా కదలని బయలు లేక నిరావరణము రెండవది సంపద అనగా సూక్ష్మ అను చరణము లేకను పుట్టెడు రూపములకు ఉపాధిలేనిది ఏరూపములును పుట్టవుగదా ? మన్నుపాధి లేకుండిన ఘటములు కలుగవుగదా ? మరియు మసి లేకను శ్రీరాముని రూపము వ్రాయుట కాదుగదా ! ఈ అవకాశముగల అణువుల సంపద కదిలెడు హేతువుచే తిరిగెడు ఉండవడినను, కలిగిన గాలిని, విడువని వేడిని కలిగెడు కాంతిదువని చేతనశక్తిని, విడువని పదార్థమేర్పడినందున రజో సత్వ తామసమగు గుణములు ఈ మూడొకటిగ నుండెడు చేతన ప్రకృతి కార్యమునను, అతిసూక్ష్మములగు అవ

కాశము గల అణువుల సంపదగల పదార్థచేతన మందున, పుట్టి పెరిగిలయమగు సంపదగల సృష్ఠంతయు, వేగముగల కాంతిని మించిన సూక్ష్మఅణువుల నుండెడు అవకాశము నందున, ఏర్పడు పదార్థ జగదాకారమంతయు సూక్ష్మఅణువుల చెంచలమెరుగని, నిర్గుణమచలము అనబడు బయలున, కనబడు సృష్ఠంతటికని కారణమగు ఓంకారము గల సగుణబ్రహ్మమునందున, కలిగిన బ్రహ్మచే, కనపడు జనులందరు కార్యము తరువాతను పుట్టెరుగని జనులకు జన్మముగలదను అనుమానము ఎందులకు జీవితవ్యవధిలో కోరిన కోరికలకు తగుఫలమును పొందెడు జనులందరుకును సగుణ బ్రహ్మమునకు మించిన మరియొక బ్రహ్మము నెపరెరుగరు. మరియు సగుణబ్రహ్మము నిర్గుణబ్రహ్మముకాదు. సగుణ బ్రహ్మములేకను జగముండదు. మోక్షము కోరెడు జనులుందరు మరియు సగుణము నిర్గుణమిడువక ఏర్పడు తనువులలో ఈ రెండెన్నడు ఒకటిగనుండవు. కదలని దుండక కద లికవని జరుగదు.

తొమ్మిదవ ప్రసంగము :

ఇక కదిలెడు చేతన పదార్థగుణమునకు కదలని నిర్గుణమునకు ఈ రెండెన్నడు ఒక పోలిక నుండవు గదా! ఈ రెంటిలో శాశ్వతమగునది ఏదందురు? ఇందుకు మరియొక ఉపమనగా ఖాళీస్థల ముండక జీవించెడు జనులుండరు. తిరిగెడుస్థల మిడువక ఇల్లెవరును కట్టరు గదా! అట్లుండెడు అచలము అనబడు బయలున కదిలెడు కార్యముచే కదిలెరిగించెడు ప్రాణులు చెరించుటచే

గుర్తెరిగెడు సగుణము నిర్గుణము భేదములందున నిత్యమనిత్యము ఇంవేదని గుర్తుకు తెత్తురు. ఇందుకు మరియొక టేమనగా ఇక ఎట్లెరిగిన ఆత్మను ఎరిగినవారగుదురు. ఇందుకు అవిద్యాచేతన మగు ఈ రెండింటను కదిలెడు శబ్దక్రియచే ఓంకారంబను ప్రకృతి కార్యమునను కలిగిన రూపములకు కారణమగు అక్షరబ్రహ్మము చూచెడు నీ నేత్రము లాంతర్యమునను శుద్ధస్ఫటికమైన అహో జ్యోతినిగల జ్ఞానప్రకాశము నీ మనసెరిగెడు ప్రత్యగాత్మయది. అది నేనని ఎరుగుటే బ్రహ్మము నేనని ఎరిగెడు మనసు అను కొనుచుండును. అనుకొను మనసునుగల స్వభావ మిట్లుండును. ఎట్లనగా కోరిన ఆకారములను ప్రకాశింపజేసెడు సాక్షగు జ్ఞాన ప్రకాశము ఈ మూడిడువక ఎరిగించెడు ఎరుకగు మనసు జ్ఞానము ధరించినను స్థితి ధరించుట కొప్పదు. జీవితకార్యమువరకును సంక ల్పించెడు స్వభావము విడువక నుండదు. ఇక సంకల్పించెడు విషేంద్రియ సంబంధమునను కలలో కనపడు వివిధములగు రూప ములను గనపరచెడు సాక్ష్యగు ఆత్మజ్ఞానప్రకాశము లేకుండిన ఏ రూపములను కలలో చూచెరుగడు. అట్లే జాగ్రతయందున తలచిన రూపములను గనపడుచుండును. జనులందరియందున ఆత్మజ్ఞానము ఇట్లుండును. చెప్పెడువరకును గుర్తెరుగరు. ఇందుకు మరియొక టేమనగా ఓంకారమునకు విశేషమగు ఈ అక్షరజ్ఞాన ప్రకాశమే సుఖదుఃఖ జరామరణము లెరుగనిదని, ఒకదానిచే పుట్టనిదని, పుట్టించనిదని శాశ్వతమగు ఈ ఆత్మను ఏ ప్రమాణము చేతను ఎరుగుట దుర్లభమని చెప్పిరి. ఇందుకు సూర్యునిప్రకాశ

మందున కనబడు నీ యవయవ పోలికలను గనవరిచెడు నీ ప్రకాశము ఏ రూపము గలదని ఎవరెరుగరు? ఇదిగాక బహువిధ రంగుల రూపములను గుర్తుకుతెచ్చెడు అవకాశముగల ప్రకాశమును ఈ రూపము గలిగుండెడుదని జనులెరుగుట దుర్లభము. తలచిన రూపములను కలలో కనవడు రూపములను గనవరిచెడు సాక్షగు ఆత్మజ్ఞానప్రకాశము కలదని చెప్పక తప్పదు గదా! లేదని చెప్పిన సాధకు లొప్పరు గదా! ఈ ఆత్మను తెలియుటకై సాధనలేకను తెలియదు.

ఆత్మను తెలిసెడుకొరకై ఆశించినవారు ముక్కలు మూనెరిగెడు మానసశరీరబాధల కోర్వరు. ఓర్చెరిగినవారికి శాశ్వతమగు ఆత్మెరిగినవారై యుందురు. ఇక విశేషమేమనగా చీకటిలో ఆత్మజ్ఞానప్రకాశము జూచిన సాధకులందరు బ్రహ్మము నేనని మనసుచే ఆనందింతురు. దానందున జగమేలేదని వాధింతురు. మరి రజ్జువునందున సర్పభ్రమ కల్లని తెలిసిన విధమున జ్ఞానము కన్యము జగమేలేదని బోధింతురు. భార్యాబిడ్డలు ధన సంపదలన్నియు కలలో గలిగిన సంపదవలె మేల్కాని కల్లని తెలిసిన విధమున మరణము తరువాతను మన వెంటుండని ధన ధాన్యములని నమ్మింతురు. జననము మరణము సుఖదుఃఖము లెరుగని జ్ఞానమునకు మించినదిక లేదని ఆత్మను ఎరిగినవారందరు పరమాత్మను చేరుందురువారని బహువిధములుగల కథలచే మెప్పింతురు. ఈ విధమెరిగిన పెద్దలు ఆకలితప్పెడు మార్గము నెరుగక ధనికుల సంసారములను ఆశింతురు గదా! అంతటితో

తృప్తుండని బ్రహ్మజ్ఞానులు వేరుండెడుకొరకై మందిరమఠములు కట్టుటకై ధనమార్జింతురు గదా! అసత్యజగమని చెప్పొప్పించిన జ్ఞానులు సాధించిన దేమిటి? ఇక మరణము తరువాతను దేవునిలో వారెట్లున్నది ఒకనాడైనను చెప్పరుగదా! తత్వజ్ఞులు జీవన్ముక్తులు భక్తులు తనువిడిచిన తరువాతను ఏ లోకము నున్నది మోక్షమునందున్నది మోక్షము తానైయున్నది ఎవరును ఎరుగరు. వారును చెప్పరు. ఇక సర్వాంతర్యామగు ఆత్మందున మోక్షము అనునది ఒక దేశము కలదని భావించెదమా? లేక అది ఒక పట్టణమా? పల్లెనా? ప్రాణుల అంతర్గతమై యుండెడు పరమాత్మని ఎందుండెడువాడని భావింతుము. తనువును విడిచిన తరువాతను వారిని వారెరుగరు. మరి ఒకరిని వారెరుగరు. మరి మనము దేవుని ఎరిగేమయ్యేదము? ఇకపై గుర్తెరిగెడు దేమిటి? ఇందుకు మరియొక విశేషమేమనగా ఈ రూపముగల దాత్మని ఊహనుగని ధరించని మనసు మరి లేకుండగ నుండెడు దెరుగని బ్రహ్మజ్ఞానులు ఎరిగిన దేమిటి? గనుగొను రూపములకు సాక్ష్యగు జ్ఞానము భక్తుల కాశ్రయమై వెలిగెడు జ్ఞానప్రకాశమందున వేరుగనుండెరిగిన మనసు చూచితినని ఆ జ్ఞానము గనుగొను బ్రహ్మము నేనని అనుకొను మనసుకు తన్మాత్రలజ్ఞానము మరియొక విధమున తోచును. శబ్దజ్ఞానము, స్పర్శజ్ఞానము, రూపజ్ఞానము, రసజ్ఞానము, గంధజ్ఞానము. ఈ ఎరిగించెడు జ్ఞానము ఒకటైనను భేదములగు రూపములను గనపరిచెడు ప్రకాశమును రూపములు ఎన్నడు పోలుండవు. తెలివి తెలివిచే తెలిసెడు విధమున ఉపాధినుం డెరి

గించెడు జ్ఞానము తెలియదు. ఇక శబ్దజ్ఞానము కనపడునదికాదు. వినపడునది. ఇది తెలివిచే ఊహించెడిది. గాని ప్రకాశమందున గనపడు పదార్థ మదిగాదు. ఈ విధమున స్పర్శజ్ఞానము తనువు తాకిన వేడిమి చల్లన తెలివిచే ఎరిగెడుదది. గాని చూచుట కగు పడనిది.

ఇట్లు తెలివిచేతను జ్ఞానముచేతను చైతన్యబ్రహ్మము గల దని మనసెరిగించును. ఇక రూప, రస, గంధము మీ రెట్లెరిగె దరు? చైతన్యావతసత్తాభూతములైదందున సూక్ష్మములగు తన్మాత్రలు తన్మాత్రలయందున కార్యములగు విషయేంద్రియ సంబంధముచే జేసెడు కర్మము నెరిగెడు అంతఃకరణముచే నెరిగెడు నిమిత్తమాత్రములగు జ్ఞానేంద్రియ సంబంధము విడువని తనువున గలిగెడు సుఖదుఃఖములను తెలిపెడు కారణమగు మనసుకు మించినది మరియొక పెరుగరు. మరియు సాధనచే అంతర్యమునను జూచిన ఆపోజ్యోతినిగల ప్రత్యగాత్మను చూచిన మనసు ఆ రూపము ధరించి మరి సంకల్పము లేకుండగ నుండదు. ఇందుకు మరియొక ఉపమనగా పృథివను ప్రమిదందున నీళ్ళను నూనెలో వెలిగెడు జ్యోతిలో గాలగ్నిధ్వని గనవచ్చును. ఇందున ఐదుగనపడు భేదములగు రూపములందున విశేషమగు ఆరవ ప్రకాశము తన రూపమును గుర్తుకు తెచ్చును. వ్యాపకమగు ప్రకాశమందున అవకాశముగలదై యుండును. అవకాశముగల ప్రకాశమందున భేదములగు రూపములను ప్రకాశింపజేయును. తన మూలపదార్థములను గుర్తింపజేయును. మానవులందున వెలి

గెడు జ్యోతికి ఉపమానముగల ప్రమిదందున వెలిగెడు జ్యోతికి భేదము ఏమున్నది ?

పదొావ ప్రసంగము :

ఇక మానవు లంతఃకరణములందున సాక్ష్యగు జ్ఞానము వలె నుండెడి విధమున భూతములందున చైతన్యముగఽదిగ నుండును. అందుచే పదార్థమందున పుట్టిన చేతనశక్తెన్నడు పదార్థమెడిచుండదు. పదార్థములేకను చేతనశక్తుండదు. ఇక అకారము ఉకారము మకారమను రజసత్వతమోగుణములు ఇడువని ఈ మూడింటిచే ఏర్పడు శబ్దబ్రహ్మము కార్యమునను ఓంకారంబను అక్షరసగుణబ్రహ్మముచే కలిగిన సృష్టిలో ఏ గుణముండని నిర్గుణమందున సృష్టికి హేతువ కాగలదా ! నిర్గుణమెన్నడు పుట్టదు, పుట్టించదు. చంపదు, చంపబడదు. ఇట్లుండెడు అచల బ్రిహ్మము అక్షరబ్రిహ్మము ఎట్లగును ? ఎట్లుండిన ఆత్మని చెప్పుట కొప్పును ? మరియు అణువుగ నుండెడి వి త్తనమున వృక్షాకారమువలె కనపడు విధమున, కదిలెడు వాయువు వేడిమిచే కలిగిన గుణముల పరిణామమునను కలిగిన భ్రిమగల సృష్టికి హేతువ అక్షరబ్రహ్మముగాని, సాధనమగు మనసెన్నడు హేతువ కాజాలదు. ఇందుకు నిరావరణము తన్మాత్రలు, చైతన్యము, ఆత్మ, జ్ఞానము, తెలివి, మనసు ఇవి లేనిది జననము మరణము సుఖదుఃఖము లెరుగని ఆత్మనునది ఇందే దందురు ? ఇక చెల్లి యించెడు కార్యమునను ఏర్పడు తన్మాత్రల నిడువని శక్తగు

చైతన్యము నిర్గుణ మెట్లగును? స్వరూప వర్ణ గుణ రుచి వాసన గల రూపములుండని నిర్గుణమందున రూపముగల సృష్టేవిధమున పుట్టును? ఇక పరిణామముననుపదార్థఉపాధిభేదములందున నానారుచిగుణములు తోచును. ఇందుకు హేతువ భేదములగు పదార్థములందున కలసిన మధురముచే ఆయా పదార్థరుచులును వేరుగ తోచును. అంతమాత్రమున రుచిభేదములకు మధురము హేతువ కాగలదా! ఇందుకు ఉపాధిభేదములగు వృక్షబీజము లందున, ప్రతిఫలించిన చైతన్యము వాటి కధిష్ఠానమగు చైతన్యము బీజమునందుండుటచే, పెరిగిన వృక్షాకారమునందున స్వజాతి విజాతి స్వగతభేదములగు రూపములందున గుణరుచులు వేరుగ తోచును. అంతమాత్రమున, గుణశక్తగు చైతన్యము నానారుచులకు, గుణములకు, రూపములకు హేతువు కాగలదా! ఇందుకు గుణముండని పదార్థమెన్నడు పుట్టదు. ఇక శబ్దగుణము, స్పర్శగుణము, రూపగుణము, రసగుణము, గంధగుణము ఇట్లెరిగెడు ఉపాధులందున గుణములు వేరుగ తోచును. శబ్దగుణమగు పదార్థక్రియారూపములందున అంతఃర్గతమగు గుణశక్తగు చైతన్యము రూపము లిడిచుండదు. సృష్టికి ముందెప్పుడులేనిది పుట్టిన పోలికలకు శక్తొసగెడు గుణశక్తగు చైతన్యము నిర్గుణ మెన్నడు కాదు. శబ్దబ్రహ్మము కాకుండగ నుండదు. సుఖదుఃఖములకు శక్తొసగెడు చైతన్యము నిర్గుణమెన్నడు కాదు. ఇక పరమాత్మని నిర్గుణమని భావించినచో పుట్టి పెరిగి నశించెడు సృష్టికి చేతన శక్తగు పరమాత్మనిగను భావించెడు రూపము మరి ఒకటే

దందురు. మనసేరూపముననుగని పూజించినచో ఫలమొసగెడు పరమాత్మను దర్శించితినని తెలియును. ఇక స్వరూప స్వభావ గుణముండెడు సృష్టగపడుచుండగ దేవుని నిర్గుణమని ఎట్లందుము? ఇక జీవులు జేసిన కర్మము విడువక నూతన తనువులు ధరించి జన్మలు విడువక తిరిగెడు స్వతంత్రము జీవుల కెట్లొచ్చును? ఆత్మకు వేరుగ ఎట్లుండును? చైతన్యములేకను ప్రకృతికార్యము జడమేవిధమున కదలును? నీళ్ళుండిన లక్షలాది ఘటములలో బహుసూర్యులు గలరని అనుకొనువారిని జనులేమందురు? ఘట ధ్వంసము తరువాతను వేరొక ఘటములో ప్రవేశించునని భావించె దరా? లేక పగిలిన ఘటముతో పగిలి నశించెనని ఊహించెదరా? ఇక ఆ ఘటములో బింబములో బింబము ఏమైనది? గుణమిడువని సముద్రజలమున ప్రాణముగల జలచరముల కాధారము సము ద్రము కాదందురా? పుట్టి పెరిగి నశించెడు అరణ్యమునకు హేతువుగల శక్తగు చైతన్యము పృథివిని లేదని చెప్పెదరా? శక్తగు చైతన్యము లేకను ప్రకృతికార్యమునను కలిగిన జగ మని ఒప్పెదరా? ఇందుకు సుఖదుఃఖము లెరుగని నిర్గుణమగు పరమాత్మే దందురు? ఇక కారణమందుండెడు రూపము కార్యము నందుండెడు విధమున అనంతకోటిరూపములందున కారణరూపము ఏ రూపము కలదని పోల్తురు. ఇందున విశేషమేమనగా వ్యాపక మగు చైతన్యము విడువని కార్యమునను కలిగిన ప్రకృతిగుణ ములచే పుట్టిన శరీరరూపములందున వ్యాపకమగు చైతన్యము ఉపాధి తనువులలో వ్యాపించిన ప్రతిబింబపు జీవులు పుట్టి పెరిగి

నశించిన తనువును విడచిన ప్రాణమునకు అధారముగల చైత న్యము ఆశ్రయకార్యమునను ఏర్పడు రూపములందున తోచెడు ప్రతిబింబము ఉపాధి తనువిడచిన తరువాతను వ్యాపకమగు బింబము, బింబమునకు వేరుగ ప్రతిబింబము యెట్లుండును ? జన్మకు వచ్చెడు అధికారిందెవరు ? మరియు ఒక మర్రిబీజము నందున పెరిగెడు వృక్షాకారము, ప్రాణముగల చైతన్యము ఈ రెండుండిన బీజము పెరిగినకొలదిగ, వృక్షముతోపాటు చైత న్యము పెరిగెడిదని అనుకొందుమా ? లేక వ్యాపకమగు చైతన్యము నందున వృక్షము పెరిగెడిదని ఊహింతుమా ? ఇక భూతము లందున పెరిగెడు సృష్టి పుట్టి పెరుగుచునుండగా చేతనప్రాణులలో జనులందున జనులు పెరిగెడు సృష్టి పుట్టుచునుండగా జన్మము లకు జన్మలు కలుగుచునుండగా మరణమునకు తరువాతను పుట్టెదరని పుట్టిన తమ పుట్టుగ నెరుగని పండితులు చెప్పుట తప్పని చెప్పుట తప్పా ? ఇక ఇట్లు జనులకు జనులు పెరిగెడు సృష్టిలో వారివారి గర్భములందున పుట్టెడు పునర్జన్మలు పుట్టగ వడుచుండగ, పుట్టెడు కార్యముతీరిన వృద్ధులు, చేసిన పాపముచే మరి పుట్టెదరని చెప్పిన శాస్త్రము దేవునిదని ఒప్పించిన పెద్దలు చెప్పినదంతయు ప్రత్యక్షవిరోధము కాదా ? శాస్త్రజ్ఞులు వారి పుట్టుగ వారెరుగరు. చచ్చిన తలిదండ్రులు ఎందున్నది వారెరు గరు. జీవించెడుకొరకేర్పడు మతశాస్త్రాభిమానము జనులలో కలవరపరచెడువని చెప్పుట తప్పని చెప్పిన తప్పా ? మరియు తలిదండ్రుల కిరువురికి, ఒకటిగ తోచిన భ్రమకార్యమునను కని

పెంచిన సుతులకు వేరుగా తలిదండ్రులను గనుగొన్నట్లుగా, కనపడు మహాభూతములందున రూపములేర్పడు పదార్థము చైతన్యము గనపడు తలిదండ్రులవలె గనుగొను సృష్టిలో పుట్టిన స్త్రీ పురుషులకు జీవితవ్యవధిలో భ్రమతీరెడు కార్యము జరిగెడు తనువున పుట్టిన జనసంపదలో తలిదండ్రుల మూలమునను పుట్టిన వారికి పుట్టెడు పునర్జన్మలు పుట్టగపడుచుండగా పుట్టెరిగిన జనులకు మరణమునకు తరువాతను పుట్టుదురని చెప్పుట తప్పని చెప్పిన తప్పా? తనువిడచిన తలిదండ్రుల భ్రమ మరలేకార్యమునను పుట్టును?

ఇక అంతఃకరణము స్వతంత్రిశక్తెరుగదు. పెరిగిన తనువుతో పెరిగెడు అంతఃకరణము యవనమునను స్వతంత్రశక్తెరుగును. బాల్యమునను చేసిన చేష్టలు యవనమునను జేసిన చేష్టలు వృద్ధాప్యమునను జ్ఞాపకమొచ్చిన మనసుని విడువని జ్ఞానముచే తెలివై గుర్తుకు తెచ్చును. మరి తనువు నశించిన తరువాతను మరల తెలివేవిధమున జన్మకుదాగల హేతువు కాగలదు. ఇందుకు మూలపదార్థము అనగా చైతన్యాశ్రియ మాయాభ్రమచే కలిగిన సంకల్పము భాషించుటకై వెలువడు శబ్దార్థము మరలేవిధమున తన మూలమునను చేరును. మరియు పర్వతమున పుట్టి కారెడు జలమేవిధమున మరల పుట్టిన జలమూలమునకు చేరును. ఇక ఈశ్వరమాయాభ్రమ మూలమునను పుట్టిన జన్మములకు విడువని పునర్జన్మలు పుట్టుచునుండగ మరణించిన తరువాతను మరెప్పుడును పుట్టెదరని బోధింతురు? గాని ఇది పుట్టినవారెరుగరు. కన్న

తలిదండ్రులు ఎరుగరు. బోధించెడు గురువులు ఎరుగరు. ఇక ఎరిగినవా రెవరందున? అల్లినకథలం దాకారమునను దారెరుగక పోయెడువారికి, తన రూపము తామెరుగరు గదా! ఇట్లు ఒకటి మరుగునబడి చింతించెడువారికి దారెరిగించెడు హేతువ దీపమే గదా! ఇక జనులందరియందున పరమాత్ముడు గలడని చెప్పి ఒప్పించని పెద్దలు చెప్పినదంతయు తప్పని చెప్పిన తప్పా? ఇందుకు మతములో జనులందరు ఎరిగిన విశేషమేమిటి?

పదకొండవ ప్రసంగము :

మరియొక చేమనగా ఎట్లుండిన రూపము దర్శించిన దేవుని జూచితిమని జనులందరు గుర్తెరిగెడు రూపము గురువులు జూపొ ప్పి చరు. మరియు ఒకరెరిగినదానిని మరియొక రొప్పరు. ఏ దెట్లున్నను శిష్యులలో పెరిగిన గురువులు యావన్మందియు జగ మసత్యమని చెప్పుట తప్పని ఏ గురువులు చెప్పరు. ఇక ఏ రూపమునందున పుట్టి పెరిగి నశించెడు నీరూపము అసత్యమా? జగమును ధరించెడు రూపము అసత్యమా? ఈ రెంటందున భేదము నెరుగని శాశ్వతమగు అవకాశముగల అచలబ్రహ్మము అందరికొకటని ఒప్పరు. ఒప్పనిజ్ఞానులు స్వార్థఅధికారముచే కలి గిన సంపద, కనిపెంచిన పుత్రులు తిని సుఖపడువారుండగా, జగ మసత్య మెట్లిందురు? ఇక యుండినవారిని జూచి ఏడ్చుచుపోయెడు వాడసత్యమని వాడెరుగడు. ఇక గురువులు శిష్యులు, సాధులు సన్యాసులు, సాధకులగు సంసారులు దేవుని దర్శనమున స్వార్థము

విడచిన గురువులదర్శన మేనరులెరుగరు. ఇక గురువుల ఉపదేశ మునను మరుజన్మము రాదందురు. గాని పుట్టినవాడెరుగని జన్మము రాదని మెప్పించుటకన్నను, మరణము రాకుండగా జేసినచో పుట్టుట తప్పినదని జనులందరు జూచి ఆనందింతురు గదా! మత పరిపాలన ఏ గురువులు విడిచిరి? దేవుడు లేడని చెప్పిన జను లొప్పరు గదా! నీలో దేవుడు లేడని చెప్పిన నీ వొప్పవు గదా! దేవునిలో జగముతోగూడిన జనులే లేరని చెప్పినచో జనులొప్పె దరా? పిచ్చోడై చెప్పినమాటని జనులందురు గదా! ఇక అందరు జూచెరిగెడు దేవుడు ఒకడని చెప్పొప్పించని గురువులను పిచ్చో డని చెప్పరు గదా! మరియు శాశ్వతమగు అచలబ్రహ్మము నందున పుట్టినదానికి మరిపుట్టుగలేదని చెప్పొప్పించని పెద్దలు పుట్టి పెరిగి నశించెడు సృష్టిని అసత్యజగమని మరియొక పర లోకము గలదని సాధింతురు. గాని గురువులు అసత్యజగమున పుట్టిన నరులందరు అనిత్యులందురు. అందరు దినమెరిగిన కథయే చెప్పుచునుందురు. ఇది అట్లుండగా ప్రతి మతములయందును అందరు ఎరిగినదే ఒకటి సత్యము రెండవది అసత్యము. ఇందున సత్యముగల శాశ్వతమగునది ఏదందురు? ఇది ఇట్లుండగా అశాశ్వితజగమును పాలించెడు ప్రభువగు ఈశ్వరు డెరుగని మోక్షము కార్యముకొరకేర్పడు అనిత్యజనులందరు బ్రహ్మ మునను ఎట్లెరుగును? ఇక అసత్యజగమును పాలించెడు ప్రభు వెట్లెరుగును? ఇక ఇదంతయు ఎరిగెరిగించెడు సాధనమగు మన నేమయ్యెను? ఇందుకు మరియొకటేమనగా అసత్యజగమని

చెప్పినదానందున పుట్టిన అనిత్యజీవులు నిత్యులు ఎట్లగుదురు? మోక్షము ఎట్లొచ్చును? బ్రహ్మమునను తోచిన భ్రమరూపములను, బ్రహ్మమునెరుగక చెప్పినవారని చెప్పిన తప్పా? ఇక సోదర జనులందరు తెలియదగిన దేమనగా ఒక హేతువుచే జరిగెడు కార్యమునను కలిగెడు తనువులలో హేతువుగల కార్యము తీరిన తరువాతను మరి కార్యమువల్లను కార్యము జరుగదు. ఎట్లనగా ఫలవృక్షములను ధరించెడు బీజము చెడి వృక్షాకారము ధరించి ఫలములు కాచెడు కార్యము తీరిన తరువాతను మరి ఏ హేతువ వల్లను పోషించెడు జలపృథివి ఆశ్రయమున్నను ఎండి నశించెడు చెట్టెన్నడు ఫలములు కాచెడు కార్యము జరుగదు. ఇక కార్యమునను మరి పుట్టెడుకార్యము తీరిన తరువాతను కార్యమునందున కార్యము జరుగదు. జరిగెడుకార్యము లేక నశించును. ఇందుకు జగమంతట నిండుండెడు హేతువుగల వాయువులేకను ఏ ప్రాణులు నిలువవు. తనువున గల ఊపిరితిత్తులు విడిచిన వాయువులేకను తనువున ప్రాణము నిలువదు. మరియు ప్రాణము వచ్చెడు కార్యము తను వెరుగదు. అంతటగల వాయువు లేకుండగ నుండదు. పుట్టినవాటికి ప్రాణముగల వాయువు లేకుండగ నుండదు. ఇది ఇట్లుండగా సృష్టిని పుట్టినవారందరు పుట్టించెడు కర్మకు హేతువు కాగలరా? సృష్టికి హేతువు కాగలరా? ఒక హేతువుగల విద్యుచ్ఛక్తికి తగిలెలిగెడు బుగ్గలలో వెలిగి నశించిన విధమున, మరి రాదని తెలిసినవిధమున కార్యముతీరి నశించి మరి పుట్టదు. ఇక మానవులందరు మానవులని ప్రేమించని మత

మెందులకు? గురువుల బోధెందులకు? పదుగురు గురువులు పది విధములు చెప్పుటలో నమ్మదగినదిందేదని ఎరుగని నరులందరు ఎరిగిన దేమిటి? వివాధమా? దేశమునను జీవించెడు సోదర జనులకు జేసిన ద్రోహము కలిగినదని చెప్పుట తప్పా? జనులందరు ఒకటిగ భావించనివారందరు దేవుడు ఒకడని ఎట్లొప్పింతురు? మరి ఏమనగా విచిత్రజగమునకు స్వశక్తిహేతువుగల ఇంద్రి జాలకని కోరిక తీరెడు భోక్తగు స్వశక్తికార్యమునను కల్పించిన తనువులలో తనువులు కనిపెంచుటచే తండ్రియు, తాతయు, ముత్తాతయు తరతరములు తానైయుండెడు కర్తను గనుగొన నెరుగని గురువులు తాడును పామని వాధింతురు. గాని చలనము గల నిజమగు పామును కదిలించెడు చైతన్యము తామెరుగరు. జగ మసత్యమందురు. మరి కర్మమునను పుట్టితిమందురు. అందుకు మిథ్యాజగమని చెప్పుచు, బహుకర్మలు విడువక చేతురు. కర్మకు తగు సంతానము కలుగకమానదు. నిజమగు దేవుని జూపెదమని విప్లవజనులను సృష్టింతురు. అసత్యజగమని ఎరిగిన మార్గము ఇట్లుండును. అనగా జగమసత్యమనుదానిలో సత్యము ఎట్లుండును? వారెరిగెదరా? మరియు పుట్టే గిట్టేవరకును పోషించెడు ఈశ్వర సృష్టున్నది. పుట్టినకార్యము తీరిన తరువాతను గిట్టేవారికి మరి పుట్టుగ లేకున్నది. ఇంకా అసత్యజగమని చెప్పేవారికి తిని విని చెప్పెడు వాక్కున్నది. జేసెడు కర్మములకు తగుజన్మలు కలవని బోధించెడు శాస్త్రజ్ఞులు గురువులు. శిష్యుల సంతానము తినగల ధనధాన్యములు, మఠములు, దేవుని మందిరములు కలిగుండగా

అశాశ్వతజగమని గురువులు బోధించెడు జగమందున్నవి. ఇక అసత్యజగమున జీవులుజేసిన పాపములకు అశాశ్వత జగమును పాలించెడు శాశ్వతమగు ప్రభుదరి పుట్టెడుకొరకేర్పరచిన తీర్పున్నది. అసత్యజగమని ఎరిగినపెద్దలు తమ వెనుకటి జన్మమెు తామెరుగరు. ఎరుగక పుట్టెడు నరులందరు జీవించెడు జగమును అసత్యమందురు. ఇందుకు జగమసత్యమా? లేక తామసత్యమా? తామెరుగరు. అసత్యమనువాడు ఇక ఎరిగేదేమున్నది? చేసిన కర్మమునకు పరిహారము ఎవరిని కోరేపని ఏమున్నది?

పంద్రెంచవ ప్రసంగము:

మరి ఏమనగా వైద్యుడు రోగికాడు. ఓషదులచే చేయబడిన మందునుకాడు వైద్యవృత్తిచే జీవించువాడు రోగికి మందుకు మధ్యవర్తి. ఒక వేళ వైద్యునకు రోగమొచ్చినను, మరిఎవరికొచ్చినను మందు అనుపానముతో పథ్యముచేయక, రోగము కుదరక మరియొక రోగము వచ్చును గదా! మందులో ఏఒకటితక్కువున్నను మందుపని చేయదుగదా! వైద్యుని నడవడిక ఏదిలోబించినను వ్రిజాభిమాని కాడుకదా! ఇక ఇరువురు నేరస్తులు కారాగారములో ఒకరిని మరియొకరు తప్పించగలరా? అట్లు కర్మముచే పుట్టిన గురుశిష్యులు వీరిరువురు ఒకరి కర్మను మరియొకరు ఎట్లు తప్పించగలరు? ఇక తప్పెడు ప్రయత్నము ఎవరికివారు విముక్తికి తగు కర్మము చేయక తప్పదుగదా? అటుపై కలిగెడు జన్మ అభిమానము తొలుగునుగదా! మరియు కొందరు మందును గురింతురు.

వ్యక్తిని గుర్తించరు. మరికొందరు గురుబోధను గుర్తింతురు. గుణ వును గుర్తించరు. ఇందు జనులందరు గుర్తించెడు విశేషమేమిటి? ఇట్టి సహవాసదోషమున జనులేమదుగురు? వివాదముల పాలగుదురుగదా! నడవడిక లోభించిన వాని కుటుంబము జనులందున నిందితులై యుందురుగదా! మరియు దేశఅభిమానులు విడువక గుర్తెరిగెడు విశేషమేమనగా పరమాత్ముని నిర్గుణమందురు గాని నిర్గుణమందున పదార్థగుణములు రెండొకటై పుట్టిన పుట్టుగ లేకను ఏ రూపములును పుట్టవు. ఇందుకు పుట్టిపెరిగి జేసిన ఘనకార్యములను జూచి ఆనదించెడు జనులందున ఘనులగు అవతారులను పూజించుట తగదందురు. కొందరు సాకారము పూజ ఒప్పరు. ఇక శరీరకోశముచే కప్పిన విశయేంద్రియ సంబంధమునను ఏర్పడి ఎరిగెడు మనసు సాకారముకాదా! వాక్కున వెలువడు కోరికలకు మూలముగల భావము సాకారము కాదా! వాక్కున వెలువడు శబ్దాకారములన్నియు సాకారము కాదా! మనసెన్నడు మరువక గుర్తించుట కొరకై వ్రాసిన పోలిక బేధములగు అక్షరలిపి సాకారము కాదా! నిర్గుణమునుగని గుర్తెరిగెడు మనసు సగుణముకాదా! పుట్టిన పిల్లల పోషించెడు కార్యమునకు మూలము తలిదండ్రులకోరిక సాకారముకాదా! గుర్తెరుగని పాపము పుణ్యముకలదని బాధించెడు పాపము సాకారముకాదా! పాపము నిర్మూలించుటకై విగ్రహగను అరచెరిగించెడు మంత్రము సాకారముకాదా! సాధనముచే భ్రూమధ్యము గనుగొను ఆత్మజ్యోతి ఆకారము, ఇంద్రియసాక్షగు జ్ఞానము, గుర్తెరిగించెడు తెలివియు సాకారముకాదా! వెనుకటి

పెద్ధల రూపము మసితో వ్రాసినరూపము సాకారముకాదా! గీసిన గీతలు వ్రాసిన వ్రాతలు సాకారముకాదా! మరియు గుణమును నిర్గుణమును ఈరెంటిని ఎరిగెడు గుణరూపములను గుర్తించెడు మనసును కోశమువలె కప్పిన తనువులో ఒకరిది ఒకరికి కనపడ కుండగ జీవించెడుమనసు సాకారముకాదా! ప్రతిమనునది ఒక రూపము చూపెరిగించెడు అక్షరమొకరూపము తనువొకరూపము తనువులొ వుండెరిగించెడు కనపడకను జేసెడు మనసొకరూపము సాకారముకాదా! జేసినపాపమునకు పరిహారముకోరెడు మంత్ర ముచే ప్రార్థించెడు కోరిక తీర్చెడు పరమాత్ముడు సాకారముకాదా! ఓం అక్షరమునగల శబ్ధము అర్థము సూక్ష్మమునను కలిగెరిగెడు కోరిక సగుణముకాదా! మతములు గురై రిగించెడు మత సింహ్న ములను ధరించి, ప్రార్థించెడు ప్రార్థనవిని, రక్షించెడుదేవుడు సాకారముకాదా మతబేధము విడువని ప్రవక్తలందరు సాకారము కాదా! ప్రవక్తలందరకును మతశాస్త్రములను ప్రసాదించిన పర మాత్ముడు సాకారముగల జగమును పోషించెడు దేవుడు సాకా రముకాదా! అవకాశముగల నిరాకారాశ్రయమున కలిగిన సృష్టిం తయు సాకారముకాదా! తనువున ఏర్పడి ఎరిగెడు తెలివియు, జ్ఞానము, మనసును సాకారముకాదా! జనులకు దయ్యము లొాది చించెడు మంత్రము సాకారముకాదా! వాధించుటకై పంపిన మత శాస్త్రములన్నియు సాకారము కాదా! స్త్రీపురుషుల బేధములను గుర్తుకు తెచ్చిన దేవుడు సాకారముకాదా! సృష్టాకరి దినములలో జీవుల పాపములకు తీర్పిచ్చెడు పరలోకము పాలించెడు ప్రభువు

సాకారముకాదా! నిర్గుణఅచలము నందున జీవించుట కేర్పడు స్పష్ఠంతయు సగుణముకాదా! చక్కెర మధురము వ్యక్తముగాకుండినను రూపము తినువారికి మధురము సగుణము కాదా! మోక్షము, నరకము, స్వర్గము, పరలోకము సాకారముకాదా! మరియు ఆకలి కోరిక తప్పని జీవితముండెడు వరకును తిని బ్రతికెడు జనులందున కలిగిన సంతానము మతములు విడువని శిష్యులు మందిర ధనధాన్యములిడువక మోక్షము కోరెడు సన్యాసులు జీవించెడు సాకారముగల జగముండగా మిథ్యని చెప్పిన గురువులమాటలో సత్యములేదని తెలిసెనుగదా! అట్లే పునర్జన్మగలదని చెప్పిన మాటలు ఎరగకచెప్పినదని చెప్పుట తప్పా? ఇందునగల సత్యము జనులెరుగక మానరు.

మరియొక టేమనగా గుణముండిన పదార్థభేదములందున కలిగెడు ఉత్పత్తిని వ్యాపించిన శక్తగు చైతన్యము వ్యాపించిన రూపమునను మీరే రూపమునను పూజించినను సాకారముగల నీ మనసుకు తగుఫలమిచ్చును. కాని సంపదలకు ఆశ్రియమగు నిర్గుణమును పూజించిన ఇచ్ఛారాహిత్యమును పొందును. ఇక కొందరు తనలోగల ఆత్మనుగను మందురు. మరికొందరు తానువారెవ్వరో తెలియుట ఉత్తమమందురు. కాని తనలో ఎట్లగపడుచుండిన ఆత్మనవచ్చును. మరియు అద్దములో తనతనువకపడునట్లుగ అద్దము వలెనుండి అగపరచెడు అంతఃకరణముగాని, జ్ఞానము తెలివిగ తోచెడు దానందునగాని, మరిదేనందునగాని తనమనసును తనకగపరచెడు బింబముకలదా? మరియు ఏయోగముచే సాధించినను

అందగపడు రూపము, వేరుగజూచెరిగెడు మనసు అరూపము నందగ పరచెడు రూపముకదా? చూచిన రూపము మనసెన్నడు కాగలదా? గురువుల దరి, శిష్యులు సాధించిన విశేషమేమిటి? జనులందరిలో దొంగలనుండి దొరవరకును దేవునితలవని వారుం డరుగదా! ఇక ఇంతకు మిక్కిలి గురువులదరి దేవుని తెలిసిన విశేషమేమిటి? మరియు ఈశ్వర సృష్టిలో కార్యమునను కలిగిన తనువులలో మరుపును గుర్తుకు తెచ్చెడు తెలివిలోగనుగొను మన స్సునగల బ్రహ్మము నెరుగక తప్పదు. ఊహకు వ్యక్తముగాకను కలదని తోచెడు వ్యాపకమగు బ్రహ్మము తనరూపమువిడచి నాశ నమగు తనువిడిచెడు జీవుడు బహుజన్మలు పుట్టెడు వరకును బ్రహ్మమునకు జీవుడు వేరుగ ఎట్లుండును? ఇందుకు సూర్యప్రకా శమందున జీవించెడు జనులందున మరణినించిన తనువునుజూచిన విధమున సూర్యుని ప్రకాశము మరణించుట ఏవరుగరుగదా! అట్లుండెడు బ్రహ్మమునందున నాశనమగు అనిత్య పదార్థరూపము లందున వ్యాపకమగు చైతన్య బ్రహ్మము విడివిడి జీవులుగల దై నశించు తనువులో నాశనమగునని చెప్పిన ఒప్పెదరా? మరియొక వేళ ఆత్మకు వేరుగా స్వశక్తి జీవుడు కలదని ఒప్పినచో వెనుకటి జన్మలు ఎరిగుండునుగదా! పుట్టెరిగెడు పుట్టుగ తప్పింపను పుట్టిన వారెరుగరు. ఇక పుట్టెరిగెడు జన్మలు పుట్టుగ సృష్టిస్వభావము కాదు. ఒకవేళ పుట్టెరిగుండినచో కనిపెంచెడు తలిదండ్రిలను పుట్టినవారెన్నడు ప్రేమించరు. ఇట్లుండిన ధర్మసంకరము వర్ధిల్లును కనుక నశించెడు పదార్థమందున్న గుణమును గుర్తెరిగెడు దానిని

ఎరిగెడు మనసు మరియొక మనసును పుట్టించదు. గుణము గుణమును పుట్టించదు. పదార్థము పదార్థమును పుట్టించదు. జీవాత్మల రూపము ఒకటై వ్యాపించిన ఆత్మందున విడివిడి జీవులుగను ఆత్మెన్నడు పుట్టదు. పుట్టించదు. జడమగు తనువు ఆత్మకు వేరై నశించునట్లుగా చైతన్య బ్రహ్మము మాయను విడిచెన్నడు నశించదు. అందుచే కార్యములేకను తనువున జీవుడు కలుగడు. కార్యము తరువాతను మరి పుట్టరు.

పదమూడవ ప్రసంగము :

ఇక మన శరీరమందున గోర్లు, వెంట్రుకలు లెక్కకు మించిన జీవులుగల క్రిములుండెడు శరీరమునకు మనసధికారగు నట్లుగా, తన మాయా పదార్థ పరిణామమునకు కలిగిన సృష్టికి అధికారగు ఈశ్వరుడెరుగని మోక్షము, తన రూపములిడువని జీవులకెట్లొచ్చును ? ఇక చీకటి అంధాకారమునను తన రూపము తానెరుగనివాడు, ఒకప్పుడు వ్రాసిన అక్షర పదబేధములను, సకలమునకు సాక్షిగా నుండెరిగించెడు, సూర్యుని ప్రకాశముచే జడమక్షర మాకారములను గనుగొన నయ్యేనుగదా ! ఇకపై ఎప్పటికిని అక్షరములు గనపరచుటకై అక్షరముల ఆకారము ధరించి జీవునిగను విడిచుండెడు స్వాతంత్రము సూర్యుని ప్రకాశమునకు కలదా ? ఇట్లు గుర్తెరిగెడు జీవన్ముక్తులు అనగా జీవభ్రాంతిని విడచిన ధీమంతులు, చైతన్య బ్రహ్మము ఇట్లుండెడుదని ఊహించెడిది. ఇక జీవులు చైతన్యమువిడచి వేరుగ ఎట్లుండును ?

ఇక అవకాశమునం దేర్పడు సంపద అవ్యక్తముగను కదిలెడు మహత్తుచే విడువని క్రియగల అహంకారపు కోరికచే సూక్ష్మము లగు తన్మాత్రలు గుణములు మూడునుచేరొక శ్రేష్ఠమైన ప్రకృతి భ్రమచే స్థూలములగు భూతములందున జఢచేతన ప్రాణులలో పుట్టిన నరులందున విశయేంద్రియ సాక్షగు ఆత్మంతటలేదని చెప్పిన ఒప్పెదరా? ఇక మధురము ధరించు రూపమునుండి మధురము వేరుగ విడదీసెరుగదుగదా! అట్లు లోహమువందుం డెడు వర్ణము వేరుగజేసెరుగదుగదా! అందుచే తనువు నశించుట చూచిన విధమున ఆత్మ నశించుట చూచెరుగరు గదా! ఇక చచ్చిన శవమును జూచేద్చెడు బంధువులందరు, పోయిన జీవుని జూచేద్వరుగదా! మరి వారి మనసును వారెరుగరుగదా! జన్మకు వచ్చెడు వారిందెవరు? ఇంతగా చెప్పినదానందున పరిశీలించుము. మరియు అవకాశముచే నీళ్లుండిన ఘటమందున కనపడు సూర్యుని బింబము పగిలిన ఘటములో ప్రతిబింబము సూర్యునికి వేరైయుం డుట కగునా! ఇక విషయేంద్రియ సంబంధము నెరిగెడు జ్ఞానమునను ఎరిగెడు ఆత్మని ఇట్లెరిగుండిన పెద్దలు స్వార్థము లేకను పుట్టెదమని గిట్టెదమని కోరిక లేకుండగ జీవింతురుగదా!

ఇక కొందరు సోదరు లిట్లందురు. కలగనువాడు తన నిజ మగు సంసారము తనుమరచి కలగనునుగదా! కలలో నిజమని నమ్మిన సంసారము మేల్కొలొమిధ్యని తనకైతానెరుగునుగదా! ఇట్లు జరిగెడు కలమేల్కొను మధ్యను గల వ్యవధిలో కలిగిన స్వప్నము సుషుప్తి మేల్కొలు తనువుండెడు వరకును జరుగుచు

నుండునుగదా! ఇందు కల సుషుప్తినిపొంది మేల్కొను వ్యవధిలో తననిజ సంసారము మరచిన విధమున, తన తనువును విడచిన తరువాతను మరియొకజన్మలో పుట్టెందుకు మరువకనుందరు? అట్లునానాజన్మలో ఎందుకు పుట్టరు. ఇట్లు కొందరు ప్రశ్నింతురు. కాని ఇందుకు తన కలమేల్కొను తరువాతను తన సంసారము తనసంపద కలదని తనతను విడువక ఎరుగదుగదా! అట్లు చూచిన మనసెప్పుడు తనువునలేకుండగ నుండదుగదా! అట్లు మరణము తరువాతను మరిఒకరికి పుట్టి మేల్కొనువాడు వెనుకటిసంసారము తానెరుగడుగదా! ఇట్లెరుగక పుట్టెనని ఎట్లందురు? వెనుకటిసంసారము కలదని తెలిసెడు మేల్కొరు గడుగదా! అందుచే వెనుకటి సంసారము జీవులు పుట్టెరిగెడు స్వభావము ఈశ్వర సృష్టిలో పుట్టిన జనులెవరెరుగరు. అందుచే సృష్టిలో పుట్టెడు స్వభావము తొమ్మిదినెలలు గడుపున పెరిగొచ్చిన శిశువు ఇరువది ఏండ్లయ్యేడు వరకును పెరుగుట సృష్టిస్వభావము. ఇట్లుండగా తలువని తలపులో పుట్లొచ్చగపడు నట్లుగా తోచిన భార్యా బిడ్డలు సంసారము మేల్కొని జూచిన జీవితకార్యమునకు తోడ్పడు సంసారమునకు హేతువకాగలదా! మేల్కలో, కలలో కనబడు జనులందరు స్థిరముగ నుండెదరా! కలలో కలిగిన విశేషమేమిటి? ఇంతకు కలలో జూచిన సంసారము విడువని మనసున మనసెరుగును. మనసెరిగిన కల మిథ్యని మనసెరుగకమానదు. ఇక తన బ్రిమచేకలిగిన కల మిథ్యని చెప్పక తప్పదు. అట్లు తలిదండ్రుల కార్యమునను వచ్చిన జన్మలు మరల సతిపతులిద్దరు కార్యమునను పుట్టెడు

పుత్రులు కార్యము తీరిన తరువాతను, మరిపుట్టెడు కార్యములేదని తనువిడిచిన మేల్కొలో కలజూచిన వాడికరాడని చెప్పక తప్పదు. ఇక పుట్టెరుగని వారిలో పుట్టెదమను సంశయమెవరికి ? పదుగురు గురువులు ఒకటై పాటించని మతములో నిజమెరుగని వారని చెప్పుట తప్పా ?

ఇక మరణము తరువాతను వెనుకటి సంసారము పుట్టెరిగెడు జ్ఞానము జీవుని కుండినచో పాతబట్టలు విడచి కొత్తబట్టలు ధరించు నెరుగునుగదా ! కొత్త శరీరము ధరించితినని ధరించు జీవుడు ఎరుగడు ఇక చూచెరిగిన వారెవరు ? ఇట్లు పుష్పపు వాసన గాలిగొని పోవునట్లు, ఎరిగెడు జ్ఞానము లేకుండుటచే, వేరొక తనువున చేరుట ఎరుగడు. ఏర్పడు తనువున జీవుడు ప్రవేశించునందురు గాని, తనువేర్పడు జీవుడు, ప్రవేశించక పూర్వము శిశువుగ పెరిగెడు ఆత్మండునలేదా ? తన్మాత్రల శక్తిగు ఉపాధి వల్లను మనసుగతోచెను శక్తిగు చైతన్యము కార్యము తీరిన తరువాతను, విడచిన శరీరములను విడిచెడు ఆత్మెన్నడు ఉండదు. మరియు స్త్రీగర్భమునను తనువుగ పెరిగెడు జీవునిలో తనువేర్పడు బింధువునందున పెరిగెడు మనిషాకారము ధరించు జీవుడు మొదలుండగా, మరియొక జీవుడు ఏ ఉపాధి కార్యమునను జీవుడు ప్రవేశించును ? ఆత్మాశ్రియమున సృష్టి ఇట్లుండును. ఇంతకును ఒకవేళ భగవంతుని సేవెరుగజాలకున్నను తుచ్ఛమైన సంసారంబని భావించినను నీజీవిత పరిమితిలో ప్రారబ్ధము తీరెడు వరకును సంసారమునుండి మరలిపోయెడు మార్గము ఎంతటి ప్రవక్తలైనను

మరలెడు మార్గము ఎరుగుదురా ? ఇక మరణము తరువాతను తనుతానెరుగక పుట్టెడు జీవులు పుట్టెదరని, బహుకర్మలు జేసి పుట్టిన దెరుగని, గురువులదరి తెలియదగిన దిందేమిటి ? ఇక ఏ మనగా రాజాజ్ఞను పాలించని జనులకు దండన భయముండిన విధమున, దేవునిచే పంపిన మతశాస్త్రములను పాటించని జనులకు దేవునిచే దండించెడు భయమే నరులెరుగరుగదా! అందుచే పాపము పుణ్యము పాటించక లక్షలాది ప్రాణులు జీహ్వకు బలిఇత్తురుగదా! ఇక తనువుకు వేరై మరిపుట్టెడు జీవులు చంపిన వారిని చంపవుగదా ! భూతములై పట్టవుగదా ; ఇట్లుండుటచే ఇక భయమెవరికి ? స్వార్థముచే జీవించెడు జనులు చేసిన మోసములకు గురియగు జనులను కాపాడుట ప్రత్యక్షము ఎరుగరుగదా! ఇక రాజ్యకాంక్షచే పరరాజులనోడించుట కూలికి జీవించెడు లక్షలాధి సైన్యములను చంపుట యుద్ధము నందున మరణించిన వారికి స్వర్గము గలదని బోధించుట జేయించినవారికి విస్తీర్ణ రాజ్యధికారము అనుభవించుట మొదలగు శాస్త్రజ్ఞానము గలదని చెప్పొప్పింతురు. శాస్త్రజ్ఞులుగాని ఈ రహస్యము మరి ఎవరెరుగరు. ఇక యుద్ధములందున చచ్చిన జీవులు పగవారిని చంపవుగదా ! భూతములై పట్టవుగదా! ఇక భయమెవరికి ? స్వార్థుల భయమున జీవించెడు వారందరు బేధము గల మతములలో సృష్టికి కారణమగు పరమాత్ముడు ఈ రూపమునను కలడని ఎట్లుందురు ? ఒక వేళ అనంత కోటి రూపములందున నారూపము గలదని చెప్పినచో నానారూపములందున నానాతగువులు వచ్చును. ఇక శరీరఅవయ

వములను కదిలించెడు శక్తి, తనువుకు వేరుగ నుండిన, మనసున కార్యము జరుగని విధమున మధురాకారము ధరించిన మధురము ఆకారము విడచుండని విధమున ఉపాధిభేదములందున నానారూప ములందున కదిలించెడు శక్తగు చైతన్యము ఏరూపములను విడచుండదు.

పదునాలుగవ ప్రసంగము :

మరియు చైతన్యావృత ప్రకృతికార్యము నెరుగని సామా న్యులు జీవితమంతను విడువని ప్రారబ్ధమునకు హేతువ తానని భావించును. ఆకలి తప్పెడు దెరుగని కించజ్ఞులు పెరిగెడు బీజ ములను పుట్టించెరుగరు. మరిచెరిగెడు మనస్సు సర్వజ్ఞత్వము కాగలదా! తనువిడచిన తరువాతను పుట్టెరుగని మనస్సు ప్రార బ్ధమునకు హెతువు కాగలదా! సాధనమై ఎరిగెడు మనసు ప్రార బ్ధమునకు హేతువు కాజాలదు. నశించిన తనువెన్నడు పుట్టదు. ఆత్మయు పుట్టదు. మరి జన్మము దేనికి? ఇక ప్రారబ్ధమునందున జేసిన కర్మము రాగల జన్మకు పుట్టుట కలదని గురువులు ఎట్లెరి గిరి? పోని గురువులు సాధించిన యోగబలముచే వెనుకటిజన్మము ఎరిగిన గురువులు కలరా? లేక ఎరిగిన శిష్యులు కలరా? గురు వులు సన్యాసులు సాధించిన వేమిటి? తలిదండ్రుల విడుచుట, సంసారులదరి జీవించుట తగదని ఎరిగెడు సన్యాసులు, సన్యా సులు చెప్పెడు బోధను నిజమని నమ్మిన సంసారులు సంసారుల కుండెడు బాధ్యత ఎరుగని సన్యాసులదరి సన్యాసై ఎరుగుట

ముక్తి అందురు. సంసారగు వసిష్ఠునాశ్రియమున సంసారై రాముడు, జనకుడు మొదలగువారెందరో సన్యాసై మోక్షమునెరుగ లేదుగదా! ఇక గండుడు గొడ్రాండ్రను తలిదండ్రుల నెరిగెడు పుత్రులు కలుగరు గదా! ఈశ్వరఆశ్రయ మాయాప్రకృతియం దున జడచేతన సంతానములేకను తల్లి దండ్రి గురువు దైవము ఎరిగెడువా రెవరందురు? ఇక కార్యమునను ఏర్పడు కుండలో పోసిన నీళ్ళందున తోచిన సూర్యునిబింబము ఈ రెంటిలో దేనికి సంబంధము? సూర్యునికా? ఘటమునకా? మరియు కార్యమునను పుట్టిన తనువులలో ప్రతిరూపములందున ఆత్మేవిధమున కలదని పొరకు లూహింతురు. జగదాకారము ధరించి ఎరుకపడని ఆత్మే దందురు? ఎట్లుండెడిదందురు? సుఖదుఃఖములెరుగని ఆత్మేదం దురు? ఇక తను వేర్పడునప్పుడు ఆకారము ధరించు జీవత్వము తనువంతట నిండుండినను జ్ఞానాశ్రయమున జ్ఞానేంద్రియద్వారము లందుండెరిగెడు విషయేంద్రియాకారముగల మనసుకు అన్యము మరి లేదు గదా! ఇక వెలువడు సంకల్పములకు సాక్షగు జ్ఞానము నందున మరువని తెలివిచే తప్పని జ్ఞాపకమందున గలిగెరిగించెడు మననే గదా తనువుకు హేతువ! ఇక ఈ మనసు జ్ఞాపకమున ఎరుగుట, మరచుట, మూర్ఛ, పిచ్చి మొదలగు శరీర మానస బాధలకుగురియై ఏడ్చెరిగించెడు మనసు తన సంకల్పములకు హేతువుగల మూలపదార్థము తానెరుగకనే ఎరిగించెడు సాధన మగు మనసుకు జన్మము గలదా? లేక సంకల్పములకు జన్మము గలదా? లేక ఉత్పత్తికి మూలపదార్థమునకు జన్మము గలదా?

ఇందు దేనికి గలదందురు? ఇక తనువున లోపల వెలుపల నడచెడు ప్రాణముగల వాయువు నిలబడిపోయినచో విషయేంద్రియ జ్ఞానము నెరిగెడు మనసును మనసెరుగదు. ఇందున జన్మకు మూలముగల అధికారగు ఇంద్రియమిం దేదందురు? మరియు చెట్టు ఆకారము ధరించు విత్తు, విత్తాకారము చెడి శక్తిఆశ్రియ ప్రాణముచే పెరిగెడు చెట్టె తుద కది ప్రాణములేకను నశించు టేర్పడు గదా! ఇక నశించని గుణమగు ఆత్మ మైనది? లేక నశించెడు పదార్థగుణమును విడచిన నిర్గుణమగు ఆత్మ మైనది? అని అడిగెడు సోదరులందున ప్రాణము నొసగెడు వాయువునను విడిచుండని శక్తగు చైతన్యము అంతట నున్నది. చైతన్యము శక్తుండగ కదిలెడు వాయువు కదులదు. శక్తనగా వాయువునం దేర్పడు అర్థముగల శబ్దమునను మరియొకరికి వినిపించెడు శక్తిని విడువని భూతములుండెడువరకును చేతనకార్యము జరుగక ఏ సంపద కలుగదు. ఇక శుద్ధమైన తెల్లని అద్దమునందున నల్లని ఉపాధి మసితో వ్రాసిన అక్షర చిత్రురువులు ప్రకాశింపజేసెడు అద్దమువలె నుండెడు చైతన్యమునందున చిత్రరువుల జగత్సంపద ప్రకాశించున ట్లుండును. ఇట్లు ప్రకాశించెడు జీవులకును సాక్షగు అద్దమువలెనుండెడు చలనరహితమగు అచలబ్రహ్మమునందున చలనసహితమగు మాయాప్రకృతి సృష్టంతయు కల్పనకేతువ గుణశక్తిత్రియములు కార్యమునకు హేతువులయ్యెను. ఇందు పుట్టి నశించెడు క్రించజ్ఞులు జన్మకు హేతువ కాగలరా? వరివిత్తనమును పుట్టించుట హేతువ కాగలదా? ఇక ఇందు తేలిన విశేషమేమిటి?

పుట్టిన జనులందున వెనుకటిజన్మము నెరిగెడుజ్ఞానము గురువులు శిష్యులు పుట్టిన ఏ నరులును ఎరుగరు. ఇక ఇందుకు కారణమేమి? పుట్టిన జీవులు ఉపాధి విడువక ఆత్మకువేరై పుట్టుచునుండినచో వెనుకటిజన్మము ఏనాటికి మరువరు. కాని తన జన్మము తను మరుచుట కేతువ ఏమనగా ఈశ్వరఆశ్రయ ప్రకృతిభ్రమచే పుట్టిన పరిణామమునను నానారూపములందున పుట్టెడు దిడువక స్త్రీ పురుషుల ఆకారమునను ఎప్పటికప్పుడు పుట్టెరిగెడు మనసు వెనుకటి పుట్టుగ ఎరిగెడు జ్ఞానము తానెట్లెరుగును? అట్లెరిగెడు స్వతంత్రము జీవులకుండినచో కారణమగు భగవత్కార్యము నేర్పడు సృష్టికి వేరైయుందురు జీవులు. అట్లు వెనుకటిజన్మము ఎరిగెడు జీవులు వేరైయుండినచో పుట్టినవారికి భాషా మత జాతి జ్ఞానము ఎప్పటికప్పుడు చదివెరిగెడు పని ఏమున్నది? అట్లు కాకుండుటచే ఎప్పటికప్పుడు పుట్టెరిగెడు మనసని గురైయున్నది. ఇక తను విడిచిన జీవునిగతి జీవుడు ఎరుగడు. జీవించెడు నరులెరుగరు. గురువులు చెప్పిన పరలోకము గురువులు శిష్యులు మరణమునకు తరువాతను వారెరిగేదేమిటి? ఏ జనులును ఎరుగరు. తనువిడచిన తరువాతను జీవుడు ఏరూపము నుండును? ఉపాధిలేకను ఏ రూపమునను పుట్టును? ఇక సుఖసంపద కోరెడు మనసుండెడు వరకును ధాతువు లేడింటిచే కల్పితమగు తనువున పంచవింశతీ తత్వములకు సాక్షిగు జ్ఞానము తెలివియు చలనము అచలనము నెరిగెడు ఎరుకను ఘనమని భావించెడు మనసు, మూర్ఛ, సుషుప్తి, కల, మరుపునుగల సమాధి మరణమునందున విచ్చొచ్చిన, మత్తి

చ్చిన శరీరవ్యాదులలో మైమరచెడు మనసు రాగలజన్మకు హేతువ కాగలదా ? ఇందు ప్రాణము, నిద్ర. ఏ రోగము ఎరుగవు. ఇందున జన్మముగల దేదందురు ? మనోసాధనచే సాధించెడు కారణకర్త ఎవరైయుందురు ? మోక్షము కోరెడువా రిందెవరు ? మరియు కులాలుని భ్రమచే లక్షలాది చేసిన ఘటములలో నిండుండిన అవకాశమునను నిండిన సంపదగల నీళ్ళందున కనపడు లక్షలాది సూర్యుని ప్రతిబింబములకు సూర్యుడు కలడొకడని తెలిసిన సోదరులందరు భావింతురు. కాని ఘటభ్రమచే అనేక సూర్యుల బింబములని భావించుట పొరపాటగును గదా ! ఒకవేళ తుదకవి ఘటవిచ్ఛిన్నముచే బింబము స్థిరముగ నుండెడిదని ఏ విధమున భావింతురు ? ప్రతిరూపములందున వ్యాపకమగు ఆత్మను ప్రతి బింబపు జీవునిగను భావింతురు గాని అఖండరూపము నుండెడిదని విచారించరు. మరణము తరువాతను స్థిరమగు జీవుడు వేరుగ ఎట్లుండును ? తుదకు గురుపులదరి తేలిన విశేషమేమిటో ఎవరును విచారించరు. తమలో తాము వివాదముల పాలగుచుందురు. ఇక సూర్యుని ప్రకాశము కనపడకుండగ అడ్డొచ్చిన మేఘమువలె తన యాత్మను ఎరుగక జేసెడు స్వార్థఅభిమానము లడ్డొచ్చును.

పదిహేనవ ప్రసంగము :

మరియు సృష్టికి పూర్వము అంతట నిండుండినదానిని ఆత్మందురు. కొందరు చలనరహితమగు బయలందురు. మరి కొందరు నిరావరణ ముందురు. ఎందరు ఎన్నన్నను కదిలేర్పడు

సృష్టికి కదలనిదొకటుండక తప్పదు. దానిని బ్రహ్మజ్ఞానులు పర బ్రహ్మమందురు. ఇక చలనసహితమగు సృష్టికి పదార్థఉపాధిచే ఏర్పడు విశ్వమునకు కారణచైతన్యబ్రిహ్మము బయలగునా? లేక నిర్గుణ పరమాత్మగునా? లేక సగుణమునకు వేరగునా? పదార్థ గుణములతోగూడిన ఇంద్రియసాక్షగు చైతన్యబ్రహ్మమునను ఉపాధిలేకను ఎరిగెడు దేవిధము? ఇందుకు అయిదు రంగులుగల అద్దములై దండున అమరిన లాంతరులో వెలిగెడు దీపప్రికాశము రంగులఅద్దములందునపడి అద్దమువర్ణఆకారములన్నిము దీపపు ప్రకాశమును అగుపడకుండగ రంగులుగలదయ్యెను గదా! ఇక రంగులఅద్దము ఉపాధులకు సాక్షగు జ్యోతిజ్ఞానము నిజమగు రూపము గనుగొను టేవిధము? ఇందుకు ఇంద్రియపరిణామ మునను ఏర్పడు శరీరమందున, మాయాశ్రయ చైతన్యబ్రిహ్మ మునను మాయను విడదీసి వేరుగ గనుగొను టేవిధము? గనుక మనసుకు సాధ్యముగాదెన్నడు. ఇక మనసు పుట్టెడు స్వాతంత్రపు శక్తేర్పడి ఏనాడును పుట్టదు. ఇక ఆత్మను ఎరిగే దేవిధము? ఆత్మను నేనను వారెవ్వరు? అందుచే ఊహకు తెలిసెడు లక్ష్యము ఊహచే గుర్తెరుగుట ఉత్తమగురువుల మార్గముకలదై యున్నది. అటుపై త్రిగుణములలో కలిగెడు మార్పెన్నడు ప్రకాశముగలదై యుండుట మన సెరుగదు. బయలాకారము ధరించెడు దెరుగదు. స్వభావమెన్నడు జన్మను తప్పింపదు. స్వభావమందునలేని జన్మను తప్పింపదు. ఈశ్వరసృష్టుండెడువరకును మిథ్యని ఎవరును చెప్పరు. మిథ్యలోపుట్టిన కార్యము తీరినతరువాతను మరి ఎవరును

పుట్టరు. మరియు ఎండలో వేడగపడకుండుటకై రంగద్దము ధరించు నేత్రములకు వేడిగతోచెడు ఎండంతయు నీళమురంగుగ నగపడుచుండు గదా! అందుకు హేతువ ఉపాధి రంగద్దముచే కనపడు ఈ మార్పుకు కారణ మద్దముగాని సూర్యుని ప్రకాశ వేడిమి కాదుగదా! ఇక చూచెడు నేత్రముచే గనపడు రూపము గనుగొను మనసు ఈ మూడును చేరొక ఉపాధి విడిచేవిధమున మరి పుట్టును? ఇక ఇందుకు కంటద్దపురంగుల ఆకారము ధరించి తన యాకారము మరచెరిగెడు మనసు తన ఉత్పత్తికి మూలము మనసెరుగక, విషయేంద్రియభేదము తెరిగించెడు సాక్ష్యగు జ్ఞానము, నిశ్చయమెరిగెడు బుద్ధియు, తెలివియు, మనసును చేరొకటై సూర్యుని వేడిమి కాంతంతయు నీలమురంగని వాధించెడు మనసు, సృష్టిని పుట్టిన భూతములంతర్గతమగు శుద్ధముగల చైతన్యబ్రహ్మమునను, ఏ విధమున ఉపాధి విడిచెరుగును? వాయువుచే ఏర్పడు మనసుకు శబ్దముగల ఆకాశము, వాయువునను చేరొక మనసయ్యెను గదా! తనువునుగల ఇంద్రియభేదములందున జన్మమునకు వచ్చెడు ఇంద్రియ మేదంటురు? ఇట్లు తత్త్వవిచారకులు నిజమెరుగక మానరు. జీవించెడుకొర కేర్పరచిన స్వార్థుల మతములలో వేరైపోయినసోదరులందరు సమిష్టినుండుట నెరిగెడు మార్గము బోధించుట ఉత్తమగురువుల కర్తవ్యము. మరియు "ఆత్మావ ఇదమేక ఏవాగ్ర ఆసీత్" అనగా మొట్టమొదట ఈ ప్రపంచము పుట్టకపూర్వము అంతయు ఆత్మాకారము నుండినదని- ఐతరేయోపనిషత్. ఇక్కడ ఆత్మనగా చలనరహితమగు పరిపూర్ణ

బ్రహ్మమే యుండెను. ఇట్లుండిన పరిపూర్ణ అచలము అనదగు ఆత్మందున అవకాశముగల పెంజీకటి ఆకారముగలదై యుండెను. ఇట్లుండెడు ఆత్మాకారమునకు నిర్గుణము అచలము బయలందురు. చలనరహితమగు పరిపూర్ణచలమునే ఆత్మందురు. ఇట్లు కదలిక లేని అవకాశముగల ఆత్మాకారము నుండెడు బ్రహ్మము సుఖ దుఃఖము లెరుగదు. సృష్టి, స్థితి, లయములు ఎరుగదు. జరా మరణములు ఎరుగదు. జగదాకారము కానిది. అంతట నిండుం డెడిదే ఆత్మని అచలబ్రహ్మంబని అనరను తప్పదు గదా! ఇట్టి కదలని అవకాశముగల ఆత్మందున ఈ ప్రపంచఆకారము యెట్లొచ్చెను? ఇందుకు పదార్థమయ్యెడు సూక్ష్మఅణురూపము లేకను ఏ రూపములును కలుగవు. ఇందుకు గాలాడక దట్టముగల అణువుండక చలనముగల వేడిమిచే తిరిగెడు ఒరవడి క్రియ జరుగక గాలగ్నియు కలుగక కలిగిన గాలగ్నిలో చేతన మేర్పడి విడువక తిరిగెడు పనిజరిగెడు దానందున గుణములు మూడగు పదార్థప్రాణముగల చేతనమున పుట్టిన తన్మాత్రల భూతము లందున జీవించెడు ప్రాణుల సంపదగల ప్రపంచఆకారమునకు తిరిగెడుదానికి అవకాశముగల కలదని పరిపూర్ణచలము మొదలొక టుండక దానందున ఏదియు కలుగదు. ఇక సుఖదుఃఖములకు జరామరణములకు ఆశ్రయమగు ప్రపంచ కర్మాగారమునందున పాపము పుణ్యములకు తగుకర్మలు అనుభవించెడు ఈ కారాగార జగము పుట్టక పూర్వము అవకాశముగల ఆత్మయే అచలమే అంతట నిండుండెను. ఈ అచలములేకను జగమగు సంపద కలు

గదు. సూక్ష్మపదార్థములేకను భావమునను తోచెడు భ్రమగల రూపములేవియు పుట్టవు. రూపములకు తగుశక్తి యొసగెడు ప్రాణముగల చైతన్యములేకను చేతనజీవులు పుట్టవు. ఇక సృష్టికి ముందున్నది ఆత్మందురు గదా! ఇక తరువాతను పుట్టిన సృష్టిలో సుఖదుఃఖములెరిగెడు తెలివగు ఆత్మేదందురు? సృష్టికి ముందున్నది అచలము, పెంజీకటి, సూక్ష్మఋవను ఈ మూటిలో సృష్టికి కారణమేదందురు? మరియు గుణముండని పదార్థమెన్నడు పుట్టదు. పదార్థమిడచిన గుణముండదు. ఈ రెంటిలో ఆత్మేదందురు? ఇందుకు భగవద్గీత సాంఖ్యములో 24 వ శ్లో॥ "నాన డెందదు కాలదు నరుకబడదు సర్వమున బర్వియుండు నాశనము గనదు అచలమీయాత్మ మరియు ననాది సుమ్ము ఒక్కవిధమున నెప్పుడు నొప్పుచుండు." ఈ లక్ష్యముగల కందమునందున అత్మకు వేరుగ కల్పితభూతములందున అంతఃకరణము మనసును జ్ఞానము తెలివియు ఇంద్రియ తనువుతో కల్పితమని చెప్పక తప్పదు గదా! ఇక మిగిలినదేమిటి? చలనరహితమగు అవకాశము గల ఆత్మను పరిపూర్ణమే మిగులును గదా!

పదునారవ ప్రసంగము :

ఇక అఖండమగు అద్వితీయ బ్రహ్మమునకు అష్టోత్తర శత నామములచే పూజించెడు ప్రాణవాతీతాయనమః, అచలాయనమః, అపరిమితాయనమః, ఇట్లు చలనరహితమగు నిర్వికారబ్రహ్మమునకు చెప్పిన అనేక ఋషివాక్యములను ఉన్నది ఉన్నట్లుగా

గురుశిష్యులు ఇందుకు "ఆత్మావ ఇదమేక ఏవాగ్ర ఆసీత్" అనగా అగ్రే = మొదట, ఇదం = ఈ ప్రపంచము, ఆత్మ = ఆత్మ, ఏకఏవ = ఒక్కటియే, ఆసీత్ = అయివుండెను. ఇట్లు ఐతిరేయో. ఇక సృష్టికి ముందుండిన ఆత్మందున జరామరణ సుఖదుఃఖములగు సంసారము ఎరుగని ఆత్మందున భూతము ఉత్పత్తికి హేతువ ఆత్మందురా? లేక చైతన్యమందురా? లేక బయలందురా? లేక ఆత్మ ఉత్పత్తికి హేతువ భూతములందురా? సృష్టికి హేతువ కారణరూపము విడువగ మరియొకటి ఇంకొక టేదందురు? అనగా తన్మాత్రలచే ఆత్మ గలిగెనా? బ్రహ్మము గలిగెనా? తన్మాత్రలచే బయలు గలిగెనా? తన్మాత్రలచే చైతన్యము గలిగెనా? లేక ఆత్మచే తన్మాత్రలు గలిగెనా? బయలుచే తన్మాత్రలు గలిగెనా? చైతన్యముచే తన్మాత్రలు గలిగెనా? ఇందు సుఖదుఃఖము లెరుగని ఆత్మ ఇందేదందురు? సృష్టికి కారణ మిందేదందురు?

ఇందు విచారించుటేమనగా విషయేంద్రియగుణముల గలిగెడు రూపములను గుర్తుకు తెచ్చెడు జ్ఞానము సత్వగుణపదార్థ ఉపాధియందున ప్రతిఫలించిన చైతన్యప్రతిబింబమే "సత్వాత్సంజాయతేజ్ఞానం" అను జ్ఞానప్రకాశమగునప్పుడు మరియొకటి విషయేంద్రియ సాక్ష్యగు జ్ఞానమునందున తెలిసిన విషయములను రూపములను మరువక అన్నిటినెరిగెడు తెలివియే ఆత్మగునప్పుడు సృష్టికి మూలముకానిది సృష్టికిముందున్నది ఆత్మని చెప్పిన ఎట్లొప్పును? ఇక ఆత్మే అంతఃకరణము ధరించి అన్నిటి గుర్తెరిగెడు

మనసందున జ్ఞానము తెలివియు కలిగినదని మనసున దాచెరిగిం చెడు ఆత్మని చెప్పెదమా? లేక సృష్టికి ముందుండిన ఆత్మే ధరించిన చేతన జీవులగు తెలివై యుండినదని చెప్పినచో తత్వ విచారకులొప్పెదరా? ఆత్మయు చైతన్యము ఒకటని ఒప్పెదరా? మరియు మిథ్యా జగమని భావించిన జ్ఞానులు విడువని మనసొక రూపమునను చేరి ఎరుగుటయా లేక అన్నిటినెరిగెడు మనసును లేకుండగ జేయుటయా లేక సంశయమును లేకుండగ గుర్తెరుగు టయా? ఇక జన్మము లేదని నమ్ముట ఎట్లుందురు? నమ్మెడు దిందేదందురు? మరియు సృష్టికి ముందున్నది ఆత్మందురుగదా! సృష్టికి తరువాతను ఆత్మండునుగదా! ఎప్పుడు జూచిన నప్పుడు గనపడు అవకాశముగల బయలు, అవకాశముగల పెంజీకటి ముందున్నది తరువాతున్నది. ఇక బ్రహ్మము నేనని చెప్పెడు జీవుని స్వజాతి సృష్టికి ముందుండిన ఆత్మని చెప్పెదరా? లేక బయలని చెప్పెదరా! పదార్థమిడువని చైతన్యమందురా? దేహేం ద్రియములకు అతీతమగు పరమాత్మ ఇందేదందురు? పుట్టదు పుట్టించదు అట్లుండెడు ఆత్మ ఇందేదందురు? బ్రహ్మము నేనని చెప్పెడు స్వరూపమిందేది? ఇందుకు "ధ్రువం స్థిమిత గంభీరం నతేజో నతమస్తతం" స్థిమితమైన గంభీరముగలది, తేజస్సు కానిది, చీకటి కానిది, పరిపూర్ణమైనది. కృ-యజు - మరియొకటి "నశూన్యం నాపిచాకారి నదృశ్య నాపిదర్శనం" శూన్యము కానిది ఆకారముకలది కాదు, దృశ్యముకాదు, చూచుటయునుకాదు, సామ- ఇందుకు మరియొకటి "యన్మనసానమనుతే ఏనమహుర్మనో మతం

తదేవ బ్రహ్మత్వం విద్ధివేదం యదిత ముపాసతే". టీ- యత్ = ఏది, మనసా = మనస్సుచే, నమనుతే = తెలియబడదో, ఏన - దేని చేత, మనః = మనస్సు, మతం తెలుసుకొనబడునని, ఆహూ = చెప్పుదురో, తదేవ = అదియే, బ్రహ్మ బ్రహ్మమని, త్వ = నీవు, విద్ధి = తెలుసు కొనుము, యత్ = నామరూపముగల ఏవస్తువును ఇదం = ఈ బ్రహ్మమని, ఉపాసతే = ఉపాసించుచున్నాడో, ఇదం = ఈ బ్రహ్మము, న = కాదు.

తా॥ ఏది మనస్సును తెలిసికొనుచున్నదో, దేనిని మనస్సు తెలిసికొనలేదో అదియే బ్రహ్మమని తెలిసికొనుము. అజ్ఞానిచే నామరూపములు గలిగి పూజింపబడుచున్న బ్రహ్మ విష్ణు ఆది స్వరూపము మనస్సుచే తెలియబడక మనస్సును తెలిసికొను నీ బ్రహ్మముకాదు. మహావాక్య - సామ - కేన -

ఇక ఇందున తెలియదగిన దేమనగా చీకటిలోనున్న రూపము మును దీపప్రకాశముచే తెలియబడునట్లు, ఆ ప్రకాశమును రూపము గల దీపము తెలిసికొనజాలనట్లు ఏది మనస్సును తెలిసికొను చున్నదో దేనిని మనస్సుతెలిసికొనలేదో అదియే బ్రిమ్మమని తెలుసుకొనుమందురు. ఊహకు తెలియని దేదియునులేదు. అదియే అనిన దాని స్వరూపము ఏమిటి ? ఎట్లుండును ? ఆరూపమును గుర్తించుట ఎట్లు ? జ్ఞానమా? గుర్తగుచున్నది. తెలివా? కలదని తెలియుచున్నది. మనస్సా ? అన్నిటి నెరిగేదై యున్నది. చైత న్యమా ? పదార్థముల యందు తెలియబడని గుణము. అదిపే బ్రహ్మమనిన తెలియుటెట్లె ? ఇందుకు "ఏపరిమానంబు చేతను

నెరుక పడని ఆత్మ నిత్యంబు చెడనిది అది ధరించు నీ శరీరంబు లెల్ల నశించునండ్రుగాన లెమ్మింక నర్జునా కదగు మనకి"- భ - సాం - 18 శ్లో - కం॥. ఆదిలోగనపడకుండు నంతమందు గనపడకపోవు నడుమనుగానవచ్చు నిట్టిదని భూతములగతి నెరిగి కూడ పార్థుడా దీనికై ఇంతవగవనేల"-భ - సాం - 28 కం॥ ఇక్కడ గ్రహించునది ఏప్రమానము చేతను ఎరుక పడని శాశ్వత మగునది ఆత్మందురుగదా! ఇక జడమగు సాధనగల మనస్సును ధరించి ఎరిగించినది ఆత్మందురా? చైతన్యమందురా? సృష్టికి సంబంధములేకను ముందున్నది ఆత్మని చెప్పిరిగదా మిధ్యా జగ మునకు మరియొక కారణమేదందురు. మరియు మిధ్యని ఎరిగిన మనసే మిధ్యలో కోరెడు మోక్షము మిధ్యలో జడమగు మనసును కదిలెరిగించెడు శక్తగు చైతన్యమునే ఆత్మందురా? నిర్గుణమం దురా? విశ్వకారణమిందేది? ఏప్రమాణము చేతను ఎరుక పడని శాశ్వతమగు ఆత్మను ఎరిగిగెడు శక్తగు చైతన్యము జడమగు సాధనగల మనసును ధరించి ఎరిగిన మనసే మనసుకు ప్రమా ణము. మరియు ఆద్యంతములందున అగపడనిది నడుమను గన పడు భూతము లందున పుట్టగపడి ఎరిగెడు తనువును గల మన సున జ్ఞానము తెలివికి మించినదికలేదు. సుఖదుఃఖములగు బాధ లచే దుఃఖించెడు జన్మవలదని అవిద్య మిధ్యా జగమని భావించిన జీవన్ముక్తులు ఎరిగిన చలన రహితమగు అచలము ఒకటి. చలన సహితమగు మాయాశ్రయ చైతన్యము మరియొకటి ఇందు జడమగు మనసును విడువక కలిగెడు మోక్షము దేనికి మరియు "నిష్క్ర-

 

మణం ప్రివేశన నిత్యేకాకాశస్య లింగం" ప్రవేశించుటకు వెలువడు టకును అవకాశమునిచ్చునిదే ఆకాశము. ఇట్లు అవకాశమునందున గాలగ్నను వేడిమి గుణసాక్షగు ప్రికాశమేర్పడునట్లుగా ఓం అను అక్షర బ్రిహ్మము క్రియచే కాలము దినములు క్రిమ విడువక తిరిగెడు సృష్టిని మిధ్యని పెద్దలు పలికిరిగద. ఇక మిధ్యలో పుట్టినశించెడు జ్ఞానులు కోరెడు మోక్షము మిధ్యలో ఎట్లు డును. ఇక సృష్టికి పూర్వము ఏముండెను ? అని ప్రశ్నింతురు. అందుకు సమాదానము చలన రహితమగు అవకాశముగల బయలేనిండుం డినదే పరిపూర్ణచలము అందురు. ప్ర॥ ఇల్లుండని స్థలమున ఏ ముండును ? స॥ ఖాళీస్థలమందురు బయలందురు. ప్రి॥ ఆకా శము భూమికి మధ్యను ఏమున్నది ? స॥ కనపడు రూపమే ఏ ముండనిదే బయలుండును. మరి ఏప్రిమాణము చేతను ఎరుగని అచలమే యుండెను. ప్ర॥ పనిబడి తిరిగెడు జనులకు అడ్డము రాకుండెడుదేమిటి ? స॥ దానినే ఎడమైయుండెడు బయలందురు. ప్రి॥ నీవున్న యింటిలో ఎట్లుండిన నీచేనిర్మిత వస్తువులుండును? స॥ నాలుగుగోడలు నడుమనుగల అవకాశముగల స్థలమందున సంపదగల వస్తువులుండును ప్ర॥ ఘటములో ఏముండిన నీళ్లుం డును ? స॥ అడ్డుండని అవకాశముగల బయలుండుటచే నీళ్లుం డును. ప్ర॥ గాలిబుగ్గతిరిగి ఎగిరెడు దానికి అడ్డుండనిదేమిటి ? స॥ ఆకారములేని నిర్వికార మొకటే ప్రి॥ ఊరుండని స్థలమున ముందేముండెను ? స॥ నిర్జన ప్రదేశమగు బయలో కటుండును. ప్ర॥ అంతట నిండుండెడు రూపములందున బయలే విదమున

నుండును ? స॥ ఘటములో అగ్నేడిమి బయటికి తెలిసెడు విధ మ్ముండును. ప్ర॥ జలమందున జలచరములు దట్టముగల నీటిలో తిరుగుటకేముండెను? స॥ దట్టముగల జలమందున వ్యక్తముగాకుం డెడు అవకాశముగల బయలుండుటచే జలచరములు తిరుగుచు నుండును. ప్ర॥ నీళ్లుండిన ఘటములో శీతలజలమే విధమున ఘట మెలువలవచ్చును ? స॥ శీతలజల శక్తికి తగినట్లుగా అతి సూక్ష్మ ములగు తెలియని రంధ్ర అవకాశముచే ఘటమెలువల శీతలజల మొచ్చును. ప్ర॥ కల్పిత పృధివాధారముచే జీవించెడు జనులందరు దేనందున తిరుగును ? స॥ కల్పిత సృష్టెరుగని పుట్టి పుట్టించని పరిపూర్ణఅచలము అవకాశముగల బయలందున పుట్టినశించెడు చేతన ప్రాణులు తిరుగుచు నుండును.

పదినేడవ ప్రసంగము :

మరియు ప్ర॥ దూరముగనుండిన వారికి పిలచిన ధ్వని శబ్దార్థము ఎట్లినవచ్చును ?

స॥ వినువారికి మధ్యను ఎడమగు బయలగు అచలము నిండుండుటచే శబ్దము వినవచ్చెను. ఇక చలన రహితమగు బయలు మరి ఎట్లుండెడిదనగా కాలిన ఇనుమును గల వేడిమి ధరించు విధమున బయలాకారము ధరించి పుట్టిన రూపములందం తట అట్లుండును. పదార్థమందున నిండుండిన మధురమువలె స్థూలములగు రూపములందున పరిపూర్ణము అగు బయలట్లుండును. దట్టముగల బట్టలో దాగిన నీళ్లన్నియు బయటికి చిమ్మొచ్చెడు

విధమున తనువులో లోపల వెలుపల వెలియించని పరిపూర్ణము అట్లుండును. చీకటిలో కట్టిన పందిరిలో కట్టిన తెరపై ఆడించిన బొమ్మలు దీపపు కాంతిచే గనుపడునట్లుగ చీకటినుండెరిగిన జనులందరు ఆడిన బొమ్మలు ఎరిగిన విధమున తెరవలె నుండెడు బయలందున జ్ఞానము, తెలివియు కలిగిన జ్ఞానులు ఆకలి పోరాటపు స్వార్థముచే అచలముగల బయలందున ఆడుచునుందురు. మరియు కల్పిత అద్దమునందున అంటక కనబడు ప్రతిబింబము గనుగొన్నట్లుగా పరిపూర్ణ చలమందున పుట్టి నశించెడు జడచేతన రూపములన్నియు బయలందంటక అట్లగపడుచుండును. ఇట్లుండిన అచల బ్రహ్మమునందున సుఖదుఃఖములెరుగని బ్రహ్మము జీవన్ముక్తులు కోరెడువారుందరు. జీవభ్రాంతిని విడిచెడు వారందరు నిర్గుణ బ్రహ్మము ఇట్లుండెడిదని గుర్తించక మానరు. మరియు కదిలికచే పుట్టినదంతయు వలలోపడి చచ్చిన చేపలగతి. వల ఎరుగని విధమున వల రంధ్రములన్నియు తీసివేయగా మిగిలిన దారము వల అంతటిదుండక కించత్ జగముగతోచెడు దానందున పుట్టి పెరిగి నశించెడు ప్రాణులు బయలందట్లుండును. మరియు చెట్టు ఆకులలో ఒక ఆకును వెలుతురు ఎదుటను ఆయాకును జూచినచో దారముతో బట్టల్లిన విధమున నరములతో నిండిన యా యాకుండును. అట్లు బయలగు బ్రహ్మమునందున కల్పిత రూపములన్నియు పెరిగెడు అవకాశము విడువక పనిజరిపెడు పదార్థ చైతన్యము సృష్టికి కారణమై అట్లుండును. మరియు అండమునందున నెమెఁయ్యేడు ద్రవముకు వేడిమిగల వాయువు పోవుటకై అండము చుట్టుండును. అతి సూక్ష్మములగు లెక్కకు

మీరిన వ్యక్తము గాకుండెడు రంధ్రములున్నట్లుగా కదలని పరిపూర్ణమునందున కదిలికచే గలిగెడు చైతన్యము విడువని గుణములుగల ప్రకృతిచే ధరించిన రూపములందున ఇట్లుండక ఏరూపములును వుట్టి పెరిగి నశించవు. ఇందు నగల విశేషమేమనగా అతి సూక్ష్మములగు అవకాశముగల రంధ్రములన్నియు తీసి వేయగా ఇక మిగిలిన పదార్థమెంతటిదని ఊహింతురుగదా !

ఇందుకు మరియొక టేమనగా శరీరమునందు అవకాశము గల బయలును అంటక ధరించు శరీరము సప్తధాతువులచే నిండున్నది, రసము, రుధిరము, మాంసము, మేధస్సు, మజ్జి, అస్థి, రేతస్సు ఈ ధాతువులేడును పెరుగుటకై విడివిడి గలదిగ నుండెడు దానిలో వ్యాపకమగు ఎడముండెడు బయలందున తిరిగెడు వేడిమిగల గాలికి బయలుండక సప్త ధాతు శరీరము పెరిగెడు పని జరుగదు. తిరిగెడు పని జరుగదు. ఇక మన తనవున గల రోమములందున అతిసూక్ష్మములగు కోట్లాది రంధ్రములతో నిండున్నది. తిరిగెడు వేడిమిగల వాయువుచే చెమటొచ్చుట గుర్తింతుముగదా ! ఇక మాంసపు శరీరమంటని బయలగు అవకాశము నవరంధ్రములంతటట తిరిగెడు గాలికి ఎడముండక పెరిగెడు పని జరుగదు. ఖాళీ స్థలమగు బయలిట్లుండుటచే ప్రాణము గల వాయువు తిరిగెడు అవకాశము కలిగున్నది. ఇట్లుండెడు బాహ్యాంతరమంతట గల బయలులో తనువులో గల బయలును తీసివేయగా మిగిలిన తనువైయుండెడు పదార్థమెంతటిదని ఊహను గనుగొందురు. యత్ కించత్ జగం సర్వం అని ఋషి వాక్యము

దాటించని వారుండరుగదా! మరియు ఇట్టే పరిపూర్ణ బ్రహ్మము నందున మనతో గూడిన జగమెంతటిదని గుర్తింతురు జీవన్ముక్తులు ఇక జగమబద్ధమగునప్పుడు నిజమగునది సృష్టికి ముందున్నది అచల పరిపూర్ణబ్రహ్మమే గదా నిలుచును. ఇందుకు బ్రహ్మసత్యం జగన్మిథ్యందురు. మిథ్యా జగమని చెప్పెడువారు మోక్షముకోరెడు పని ఏమున్నది. కోరికలిడచిన బ్రహ్మజ్ఞాని దేహ వర్ణాశ్రమ కర్తృత్వ భోక్తృత్వ ద్యాహంకార భావనా రూఢో మూఢః. తనదేహము తనజాతి తన ఆశ్రయము తానే చేయువాడు తానే అనుభవించువాడు అను నీమొదలగు అహంకార భావన కలవారు మూఢులుగా ఎన్నుదురు. మరియు అణువుగనుండెడు మఱ్ఱి విత్తనము మహావృక్షము కాగలదానికి హేతువుగల భూమిని పెరగిన చెట్టువేర్లకు పోసిన నీళ్లందునగల తన్మాత్రల శక్తిగు వాయువు చెట్టంతయు తిరిగెడు అవకాశము వల్లను పెరిగెడు శక్తేర్పడుచుండును. అణువిత్తనము ఇంతటి చెట్టెట్లయ్యెను, అను ఆశ్చర్యము కలుగక మానదు. ఇక పెరిగెడు వృక్షమునకు నిలువులో దారమువలె నరములచే చెట్టంతట నిండుండును. ఇక ఆ నరముల రెండింటికి మధ్యను అవకాశముగల బయలుండును. అట్లుండెడు అవకాశము లేకుండినచో చెట్టెన్నడు పెరుగడుగదా, అట్లుండుటచే చెట్టుకు లోపల వెలుపల బయలొకటై యుండెను. ఇక చెట్టునగల బయలు వేరుగజేసి ఊహను జూచినచో ఆచెట్టాకారము బహుసూక్ష్మముగలదై బయలున లేదని తోచును, ఇట్లెరిగిన జీవన్ముక్తులు మర్మముగని ధర్మమునను పాటింతురు. ఇట్లుండెడు

భ్రమగల జగమని ధరించి ఎరుగును. ఇక విడువని స్వార్థ భ్రమచే అభిమానముగల బంధువులందరికిని ఎరుగక వేరైపోయెడు ఒకరోజు ఇక రానున్నదిగదా ! సృష్టికి నేనను ప్రాణుల భ్రమ మూలము కారణకర్త యొకడుండగా భోక్తను నేనను అభిమానము విడచి జనులందరు నావలెనని భావముచే బ్రతికెడు స్వల్పజీవిత మందున సాధుల భావమువిని సాధించును.

పదునెనిమిదవ ప్రసంగము :

మరియు సుఖ దుఃఖములగు బాధల కోర్కెక మిథ్యా జగ మున అనిత్యము తెలిసిన శిష్యులు పరిపూర్ణము తానను భావము తలపోసెడు జీవన్ముక్తుడు ముందు తనమూలము తానను అహ మను ఇంద్రియంసాక్షగు జ్ఞానము నందున విషయేంద్రియ సం బంధము నెరిగెడు కోరిక లిడిచెడు వాడెప్పుడు అచలమునందున కలననిలేనని తానెప్పుడు తలచడు. మరియు పరిపూర్ణమునందున పుట్టని టగమును నాపుట్టుకలేదని జీవితమంతయు వాధించెడు ప్రజ్ఞానేశ్వరుడెప్పుడు ప్రజలనుకునె విషయములను విడిచెడు ప్రజ్ఞ న్నడు ఎరుగదు. ఇక చీకటి వెలుతురు కానిది తన్మాత్రలనంటని అచల బ్రహ్మమునను జూచినను జీవితమంతయు చెప్పినను అంతఃకరణమునందున కలిగిన విషేశమగు మార్పేమిటి ? ఇక మరణము తరువాతను జన్మమురాదను దుష్టాంతము ఎట్లావింతురు? వచ్చెడు జన్మము ఇకలేదని వింటిరిగదా ! కొందరు బయలందున లేనెరుకందురుగదా ! కాని తనువుగ ఏర్పడి ఎరిగెడు ఎరుకను

తనువున లేకుండగ నుండెరిగేదెప్పుడు ? ఇక పుట్టుట గిట్టుట ఈ రెండెరిగెడు మనసుకు మూల స్వరూపము ధరించు జన్మము జీవుని కెట్లొచ్చును? (మనసునకెట్లొచ్చును).

మరియొక టేమనగా సుషుప్తినుండిమేల్కొను జీవుడు మరణించిన తనువులో లేడని తెలిసిన విధమున పరిపూర్ణముగలదని తెలిసిన గురుశిష్యులు మనసునగల మార్పేమిటిగనవచ్చెను ? లేక పరిపూర్ణము మార్చెడుపని జేసెడిదా! మరియొకమాట పుట్టించెడు పరమాత్ముని కార్యమునను తనపుట్టుగ జన్మించెరుగని కోట్లాది జనులందున పుట్టిన గురుశిష్యులు పుట్టెడు జన్మలు తప్పించుటకై సాధించిన ప్రత్యక్షము ఏమిటి ? పరిపూర్ణమునను గని గురుశిష్యులు మిథ్యా జగమని బోధించుటచే కలిగిన విశేషమేమిటి గనవచ్చెను ? మిథ్యా జగమని తెలిసినవారికి పరలోకము జగమును మిథ్యని ఎరుగనివారికి నరలోకము ఇంతకు తను విడచిన జీవులు ఏలోకమునున్నది ఎవరెరుగరుగదా! ఇక గురువులలో గురువులు, మతములలో మతములు, శిష్యులలో శిష్యులు జాతులలో జాతులు. ఒకరిని ఒకరొప్పరుగదా, ఇక ఇట్లుండుటచే ప్రతిరూపమునందున గల పరమాత్ముని రూపము ఈరూపమునను గలదని నిజమెరుగక వాధించుట ఇదియొక కారణమయ్యెనుగదా ! ఇట్లుండుటచే జనులందరు ఒకటని ఎట్లొప్పును ? అందుచే కొందరు తమ జీవనమున గల అభిమానముచే చంచలమగు మనసును వంచించని పోరాటముగల సంసారపు ఆరాటముచే వంచకులగు పెద్దలు ఎంతటి పాపమునైనను జేయుటకు వెనుకాడరుగదా! గురుమార్గ అనుభవులను

గుర్తించరుగదా ! గురువులు ఎరుగని రహస్యము మావద్దను గల దని వాధింతురుగదా ! ఇట్లనగల మనసే బ్రహ్మమునేనన్నను బయలందున లేనెరుకనియన్నను, రాముని దర్శించితినన్నను, తెలివే నేనన్నను, నేనిర్వికారమన్నను, అన్నది మనసును ధరించి ఎరిగించెడు దెరుగని మూలమునను ఎరుగని మనసు జన్మకు ఎట్లొచ్చును ? ఇక స్త్రీ పురుషులకార్యమునను ధరించు స్త్రీ గర్భమునందున శిషువును పుట్టొద్దని గొంతెత్తరచినను ఒద్దని దేవుని ప్రార్థించినను పుట్టెడు స్వభావమును తప్పింపను తలిదండ్రుల తరమగునా ? లేక గురువుల తరమగునా ? మరియు దేశోన్నతి పరిపాలకుడగు ధర్మాత్ముని మరణము తప్పింపను ఘన వైద్యుల తరమగునా ? ఘనమగు మహిమలు జూపెడు సిద్ధులు, గురువుల వశమగునా ? మరియు భూమిని దాగిన విత్తన రూపములన్నియు పెరిగగవడు నట్లుగ జేసెడు వర్షము మూలముగలవే రొకటని గనుగొను విధమున సృష్టికి హేతువ ప్రకృతి కార్యము నేర్పడు తనువులలో మహాశక్తగు చైతన్యము ప్రాణముగల జీవుల జన్మలు కార్యమునను పుట్టి కార్యము తీరినశించిన తరువాతను మరిపుట్టరు ఎవరును. ఇక కార్యమునకు కార్యముతీరిన తరువాతను పుట్టించెడు కార్యము మరిజరుగదు. ఇందుకు మనసున వెలువడు వాక్కులు మనసున చేరని విధమున దేవుని సంకల్పించిన రూపములన్నియు మరిదేవునిలో చేరవు.

పందొమ్మిదవ ప్రసంగము :

ఇక పెద్దలు మిథ్యాజగమని చెప్పినను మిథ్యాజగమున జీవించెడు జనులందరు జీవయాత్ర గడిపెడువరకును దేవుని భక్తిడచిన జనులుండరు. ఇక పుట్టుట పెరుగుట కార్యముతీరి నశించుట ఇట్టి ఈశ్వరసృష్టిస్వభావము ఉండెడువరకును మిథ్యాజగమని చెప్పినచో జనులందరు ఒప్పెదరా? జీవితవ్యవధిలో దేవుని తలవక మానెదరా? ఇక జ్ఞానులు సిద్ధులు, భక్తులు, యోగులు, సన్యాసులు మొదలగువారందరు మిథ్యాజగమన్నను, మిథ్యాసంపదలన్నను ఆలి, సుతులు, చుట్టాలందరు అశాశ్వతమన్నను తనతన జీవునికొచ్చెడు మోక్షముకొరకై మిథ్యను వేరగు పరమాత్మని గుర్తెరుగనివా రుండెదరా? సాధనశ్రమగల ఆచారములను మిథ్యాజగమని మానుదురా! అట్లుండుటచే మిథ్యయ్యెడువరకును మానవులందరు లేకుండగ నుండెదరా! మిథ్యని చెప్పిన ఎట్లొప్పును? ఇట్లుండగ సృష్టిస్వభావములో పుట్టని పుట్టుగ కలదని చెప్పుటలో విడువని సందేహము బాధించుటచే సద్గురువునిదరి విచారించనయ్యెను. ఇక కార్యములేకను ఏ రూపములెప్పుడు పుట్టవు. "కారణగుణపూర్వక కార్యగుణోదృష్ట". (వైశేషి) కారణమందున ఏ గుణములు కలిగుండునో ఆ గుణరూపము లిడువక పుట్టక తప్పదు. ఈశ్వరమాయాగుణరూపములన్నియు జగమున లేవని చెప్పిన నొప్పవు. అందుచే కారణమందున కలిగిన కార్యము తీరిన తరువాతను మరి యాకార్యమునందున కారణమయ్యెడు కార్యము జరుగదు. అట్లుండుటచే ఒక పరివృత్తనము తనరూపముగల వేలాది

వై పుత్రానామాసీత్'' అని చెప్పనయ్యెను. ఇక మరణము తరువా తను జీవుడు కర్మకు తగు రూపముననను వేరొక గర్భముననను ప్రవేశించునందురు. కాని అందుకు తగు జీవుని మార్పు జీవిత మందున గుర్తగునా? లేక మరణము తరువాతను వేరొక తను వులో ప్రవేశించి గుర్తగునా? ఈ రెండును పుట్టేజీవులు బ్రతి కుండగ అయ్యెడు మార్పు ఏ నరులును ఎరుగరు. ఇక తనువిడ చిన తరువాతను ఎరిగేదెవ్వరు? పుట్టినవాడెరుగని పుట్టుగ పరు లెట్లెరుగుదురు? గురువులు ఎట్లెరుగుదురు? ఇక మరియొక టేమనగా స్త్రీగర్భములో బిందువు నిలచిన తల్లిఆకారము కాగల జీవుడు తనువుతో పెరుగుచునుండగా వేరొక జీవుడు ఎట్లు ప్రవే శించును? మరికొందరు కర్మకు తగు జన్మము కలదందురు. కాని గ్రుడ్డి, గూను, వికలాంగులు, కురూపులు నానావిధవ్యాధులు గల వారు, ధనవంతులు, దరిద్రులు, ధనదాతలు, అజ్ఞానులు ఇట్లుం డెడువారందరు పూర్వపుపాపముచే పుట్టుదురని అందురు. ఇందుకు ఘటములు చేయుటకు కులాలు కారణముగునట్లుగా పుట్టిన సంతాన మునకు తలిదండ్రుల హేతువనెరుగక పరమాత్మందురు. వారి కర్మవికారము వారెరుగరు. అందుకు సూర్యునిప్రకాశమందున దుర్మార్గులు సన్మార్గులు జేసెడు కార్యములకు సూర్యుడు హేతువ కాగలడా! అట్లు వ్యక్తముకాని సూర్యుని ప్రకాశమునకు వ్యక్త పరిచెడు శక్తగు చైతన్యము వ్యక్తముకాని తన్మాత్రల గుణకార్యాం తర్గతమై యుండుటచే ఇంద్రియఉపాదులచే జరిగెడు కార్యములకు తెలిసెడు జ్ఞానమునను మనమెరుగుచునుండును. కాని జీవముతో

నిండుండిన ప్రాణముగల మహాభూతములందున, నిండుండిన చైతన్యబ్రహ్మను వేరుగ ఎవరెరుగరు. వేరుగ విడదీసెరిగినవా రుండరు. అందుచే నిర్గుణబ్రహ్మమునకును సగుణబ్రహ్మమునకును ఈ రెండును ఒక పోలిక నుండవు. ఇక ఈ పోలికభేదములను గుర్తెరిగెడు సూక్ష్మబుద్ధిగల విచారజ్ఞానముచే మనసును మరిచెడు శ్రమగల సాధనలందున ఎవరును గుర్తెరుగరు. ఇందుకు సృష్టా రంభమునందున ఈశ్వర సంకల్పముచే పుట్టిన నానారూపము లందున పుట్టుచు పెరుగుచు గిట్టుచునుందురు. ఇట్లుండెడు పరమా త్మని సృష్టిలో పుట్టినవారికి పుట్టెడు కర్మము తప్పింపను పుట్టిం చినవారితో గాగలదా! ఇక సృష్టిస్వభావము ఇట్లుండగా తనువిడ చిన తరువాతను ఇంద్రియగుణములు చేరాక తనువయ్యేడు కార్యము తలిదండ్రులులేకను రెంటిచే కలిగెడు కార్యములేకను కనపడురూపములెన్నడు పుట్టవు. తనువిడచిన జీవుడు ఉపాధి లేకను ఏ రూపమున నుండును. మరి అగ్నిఅయ్యేడు ఆధారముచే ఎలిగిన కాంతి అగ్నారిన కాంతారును. ఇక సంశయ మెవరికి?

ఇరువదియొకటవ ప్రసంగము :

మరియు మిథ్యాజగమున కర్మముచే పుట్టెరిగిన పాపము పుణ్యములకు పరిహారము కోరెడు గురువులు శిష్యులు కలహిం చెడు మతభేదములందున అశాశ్వతజగమున వెతకిన దొరకని మోక్షము వేరాక పరలోకమునను ప్రభువగు దేవునిదరి తీర్పుచే ఎరిగెడు మోక్షముకలదని నమ్మానందించెడు జనులందున ఏమెరు

గని సంసారులు ఇడుములుపడు బాధలచే మతమెరుగక తనువిడ చిన జీవులగతి ఏమైనది ఎవరెరుగరు గదా! ఎరుగక చెప్పెడు అశాశ్వతజగము పరలోకము రెండుగ విడదీసిరి గదా! ఇక పర మును చూపెడు ఎరుగని గురువుల పాలనబడి దరిఎరుగని సంశ యములు బాధించెడు జనులకు దరిజేర్చెడు ఉత్తమసాధులమార్గము వెతకి విచారించి నిజమెరుగక తప్పదు గదా! ఇక పరమను జ్ఞానము ఏ రూపము నున్నది ఎరిగించిన దిట్లున్నది. "జ్ఞానము నకు సమాన మీజగతి లేదు. అంతకంటె బవిత్రమైనదియు లేదు. కాలమున యోగసిద్ధినిగన్నవాని ఆత్మలోపల నీ జ్ఞాన మలరు పార్థా." ఇట్లు జ్ఞాన. 4 అధ్య. 38 వ శ్లో. కం. మరియు సీతా రామ. ఇట్లున్నది. "తెలియబడుచున్న విశ్వంబుదృశ్యమంచు తెలివినై సర్వమునుగాంచు దృక్కు నేను, మిగుల నాకంటే నన్య మెద్దియును లేదు; సత్యమిది సర్వవేదాంత సంగ్రహంబు." మరియు గుణత్ర. 14 అ. 2 వ శ్లో. భగ. "అమలమైనట్టి ఈ జ్ఞానమాశ్రయించి, నన్నుబొందినవారు లెన్నండుగూడ, సృష్టి లోపల జన్మంబు నెత్తబోరు, ప్రళయమందును వారికి భయము లేదు." ఇక జ్ఞానము అని, తెలివని రెండుగా తోచెను. ఇక ఇట్లెరి గినవారందరు సృష్టినిపుట్టెడు సంశయములు విడచిన ఆత్మజ్ఞానులు చైతన్యఆవృత ఉపాధిభేదములందున దృష్టికి గోచరమగు ఆత్మ జ్ఞానప్రకాశమును పదలక్షానుభవమును ధరించుచెరిగిన ధీమం తులు బ్రహ్మము నేననువారల కిక జన్మములేదని భావింతురు. ఇట్లానందించెడు విజ్ఞానులు అశాశ్వతజగమును పుట్టిన జనులందున

జన్మించి మరిపుట్టని కోరికచే శ్రమగల సాధనచే సాధించిన ఆత్మ జ్ఞాన ప్రకాశమునకు సాటి మరియొకటి లేదని జగమును మిధ్యం దురు. విచారించునదేమనగా సృష్టిపుట్టి నశించి లయమగు నానా రూపములనుగని సృష్టంతయు అశాశ్వత మనునప్పుడు ఇక మిధ్యలోపుట్టి నశించెడు జ్ఞానుల కోరికచే గుర్తెరిగిన మోక్షము జగమున మిథ్యైపోవును గదా! ఇందుకు సృష్టంతయు అశాశ్వత మని చెప్పినచో అశాశ్వతమున పుట్టిన నరులకు మోక్షమునిచ్చెడు వారెవరుందురు? అశాశ్వతజగమును విడువక మిగిలినదంతయు అచలనమే గదా! అచలనమునందున లేనెరుకకు మోక్షము ఎట్లొచ్చును? ఎవరిత్తురు? సృష్టంతయు మిధ్యన్నప్పుడు సృష్టిని విడచి వారుండే దెక్కడ? మిధ్యలో ఎందుందురు? మరియు తన్మాత్రల సృష్ట దున కల్పితమగు చైతన్యము గుణమగు పదార్థ సత్వమునందున ప్రకాశమగు జ్ఞానము విషయేంద్రియ సాక్షిగ నుండెరిగెడు మోక్షము మనసున విడచి ఏ విధమున గుర్తింతురు? ప్రళయమునను జ్ఞానులు భయమెరుగక దేవునిసన్నిధి నుందురు. ఈ సంశయ మేవిధమున ప్రత్యక్షము కాగలదు? ఇక సామా న్యులు, జ్ఞానుల వీరిద్దరు మరణము తరువాతను వీరిరువురి జాడెవ రెరుగరు. ఎవరికి జన్మములేదని తెలియుచునుండగా జన్మము గల దని సంశయపడనేల? నానామతగురువుల బోధలచే జన్మము లేదను జనులందున ఏ మెరుగని అమాయక జనులను దేవుడు పుట్టించెను మమ్మని పుట్టిన జనులెవరెరిగించిరి? ఈ సంశయము లను తీర్చినవారే ఉత్తమగురువులు. సంశయమెరుగక జీవించుటే మోక్షము.

## ఇరువది రెండవ ప్రసంగము :

ఇక మహాభూతములందున జడచేతన రూపములందున బాహ్యాంతర ఆవ్రితమగు శక్తగు చైతన్యజ్ఞానము గుర్తెరిగెడు అంతఃకరణమునందున ఆవ్రితమగు జ్ఞానము, బ్రహ్మమునేనని ధరించువారికి మరి జన్మములేదని సాధనచే సాధించెరిగిరి జ్ఞానులు. మరికొందరు చైతన్యాత్రవత్రప్రకాశమందున కలిగినజ్ఞానము గుర్తించెడు విషయేంద్రియకోరికలం దాకారమునను మరువక నీవని మన సిడువక తెలివిని ధరించువారికి మరుజన్మములేదని జీవన్ముక్తులు తలచిరి. మరికొందరు పదార్థగుణములు మూడిడువక సృష్టిని పెంచి పోషించెడు కార్యమగు ప్రకృతి ధరించిన కార్యబ్రహ్మమునకు త్రిమూర్తులుగను చిత్రించిరి. వారికి బ్రిహ్మని, విష్ణు అని, ఈశ్వరుడని నామములకు తగు భార్యల గుర్తించిరి. వారికి సింహ్నములు వాహనములు. వారుండెడు సత్యవైకుంఠ కైలాసములు దేవునిచే జీవుల తీర్పెరిగెడు పరలోకములో వారికి తగువర్ణములు కర్మవిముక్తికి తగు జంధ్యములు, వారికి తగు మతములు, అందుకు తగు ఆలయములు పూజించుట ఎరిగెడు గురువుల బోధలు విని తనువిడచిన జనులందరు వారెనుకటి జన్మము వారెరుగక పుట్టుచునుందురు. గురువులదరి ఏమెరుగక తనువిడచిన జనులెవ్వరు వెనుకటిజన్మము ఎరుగరు. పుట్టెరిగిన వారెవ్వరు చెప్పెరుగరు. ఇక గురువులదరి ఎరిగిన విశేషమెమిటి ? మరియు తమ పుట్టుగ తామెరుగక పుట్టినవారిలో పుట్టిరి మావారని తమవారెట్లెరుగును ? జనులెట్లెరుగును ? పుట్టెదరని చెప్పినచో మీ రేవిధ

మున నమ్మితిరి ? కామవికారము విడువని ధనపిశాచ గురువులదరి జేరుటకన్నను ఏమెరుగక దేవుని తలుచుక జీవించుట ఉత్తమము గదా ! మరియు నిద్రించెరిగెడు కలలో మరచి ఎరుగని సుషుప్తిని ధరించి ఏమెరుగని స్థితి పొందును గదా ! అట్లుండెడు స్థితి గుర్తెరిగెడువారికి తన సంపద, తన సంసారముపై నేనను భ్రమవిడిచిన వారికి మరిజన్మము రాదని భావింతురు కొందరు. మరియు కలలో వచ్చిన భార్యాబిడ్డలు రాజ్యాధికారము నిజమని నమ్మానందించెడు మనస్సు, విషయేంద్రియసాక్షగు జ్ఞానమునందున, గుర్తెరిగెడు స్వప్నదృశ్యములు, జ్ఞానాతీత అవకాశమునను కలిగిన మేల్కొరిగినవారికి, జరిగిన కల జరుగక నిలిచిన కల మరువక ఎరిగెడు మనసు, జరిగిన కల కల్లని, తెలియక కలిగిన భ్రాంతని తనకై తానెరుగును గదా ! ఎరిగిన కల కార్యమునకు హేతువుకాదని విడువక మానరు గదా ! అట్లే ఇక జాగ్రితలో కలిగిన కార్యము తీరెడువరకును కనిపెంచిన తలిదండ్రుల సంతానములందున మరణించినచో పుట్టెన్నడు ఇక కనరాడని ఒకరిని ఒకరు పట్టుక మేల్కొని ఏడ్తురు గదా ! ఇట్లు ఒకరిని ఒకరు పట్టుగ ఏడ్చెడు పుట్టుగ అచలమునందున కనరాదని సాదులు బోధింతురు.

ఇరువది మూడవ ప్రసంగము.

ఇక బయలను మేల్కలో ఈశ్వరబ్రమచే తోచిన సృష్టిలో కలిగిన జనులందున కల్పించిన గురువుల అభిమానములకు లోబడి నిజమెరుగక నమ్మిన జనులందరు మోక్షము కలదని నమ్ముచు

నుండగా ఇందుకుప్రత్యక్షము పుట్టినవారందరు వారెనకటి జన్మము ఎరుగక పుట్టుచునుండగా ఇక మతమెరుగని అమాయకులగు నిరు పేదలు కష్టజీవులు మతస్వాతంత్రము ఎరుగని వారందరు మత గురువులచే పంచబడిన జనులందున, తనువిడచిన జీవులు ఏమైనది ఏ లోకము నున్నది ఏగురువులు చూచెరుగరు. ఇక మతములలో స్వజాతి మానవులందున కలిగిన విశేశమేమిటి ? మతబేదము లున్నను జనులందరు దేవుడు ఒకడని నమ్మానందించెడు భాగ్య స్యజాతిజనులందున కలిగెడు వరకును గొంతెత్తి అందరు ప్రార్థిం చెడు భగవత్ మందిర బేధములను స్వజాతి సోదర జనులకు గుర్తుకు తెచ్చిరి. ఇక గురువులు ఎరుగని దేవునినమ్మిన జనులెట్లె రుగును ? గురువుల పాలనబడి సోదర ప్రేమను మరచి బంధు వులను ఎడబాసి మతములలో మతములు గుర్తెరిగిన వారు పర మతముల పాలైరి. ఇంతకు దేవుని ఎరిగినది జనులందరు ఒకటని ఎరుగని గురువులు సాధించినదేమిటి? ఇక మరి ఇట్లు విచారింతుము. రజ్జువునందు సర్పాద్యారోపము నారోపము నారోపించి తుదకప వాదము దేనినిగని మిధ్యా జగమని భావించిరి. ఇందుకు కదిలిక లేకుండిన రజ్జువుననుగని కరచెడు పామని సంధ్య చీకటందున తోచిన బమ్రికేతువ చీకటి వెలుగుకుమధ్యను ఉండిలేకుండిన వెలు గులో పామను బ్రిమతోచెను. తుదకు సూరోద్యమున మనసున ధదించిన భయమగు సర్పాకారము కదలని తాడని గుర్తెరిగెను. ఇందుకు మొదలేతువ సంధ్య చీకటయ్యేను గదా ! తరువాత నిజమెరుగుట కేతువ సూర్య ప్రికాశమయ్యేనుగదా ! ఇందుకు

ఉపాధివశమున ప్రకాశమగు జ్ఞానము అడ్డుండుటచే మనసుకు సాక్షగు జ్ఞాన ప్రకాశము నిజమెరుగక నానాసంశయములు కలిగెను. ఇందుకు హేతువ ప్రకాశమగు జ్ఞానమేగదా ! కారణమయ్యెను. ఇక అంతట పెంజీకటినుండినచో ఏదగపడనందున ఏ సంశయములు ఏరూపములందున కలుగవుగదా ! ఇందాకప్పుడు తాడును పామును చూపుండక తప్పదు. ఇక ఈసంశయమునకు హేతువ తాడును పామును ఒకపోలిక నుండుటచే కలిగిన ఈ సందేహమువలె మరి కలిగిన సందేహమునకు కారణమేమనగా జీవన్ముక్తులు శాశ్వతమగు నది ఏరూపముగలదని భావించిరో దానిని గని నిశ్చయమెరిగించెడు జ్ఞానముచే గనలేకను పొరపడి కదలని శాశ్వతమగుదానందున కదిలేర్పడు జగముకు కదలని బ్రహ్మమే కారణమనుకొంటిమిగాని

## ఇరువది నాలుగవ ప్రసంగము :

ఇందుకు మరియొకటేమనగా బ్రమగల జగమున నేపుట్టిన సృష్టికి మూలము ఇదికాదనిగుర్తేర్పడినది వ్యక్తముగాని జ్ఞానమునను గుర్తెరిగెడు తెలివియు వ్యక్తముగాకుండెడు చలన రహితమగు పరిపూర్ణము ఈ రెండొకపోలికనుండుటచే నీళ్లను పాలను వేరుగ దీసెరిగెడు హంసాకారము ధరించలేకను నిర్గుణమగు పరిపూర్ణముచే కలిగిన జగమని భావించితిని. ఈబ్రమగల స్వప్న జగము తోచిన నామననునగల మేల్కొరిగించిన అచలమునందున మరిబ్రమగల కలరాకుండగ నిలచెను. కలనిలచినమనసు జడ సాదనమని గుర్తెరిగితిని. ఇక ఈసాధనమగు మనసాకారము ధరించి కార్యములను జేసెరిగెడు మూలము ఎవరెరుగరు. వ్యాపకమగు సృష్టంతటకును వ్యాపించిన శక్తగు చైతన్యము వ్యక్తముగా

కిట్లున్నది. జ్ఞానము తెలివియు ఇంద్రియ తనువులు పుట్టెరిగెడు ఈజగము అచలమునందున అశాశ్వత జగమందురుగాని మిధ్యలో పుట్టిన కార్యము తీరిన తనువులు మిధ్యందురుగాని, మిధ్యకుకారణ మగు ఇంద్రిజాలకుని మిధ్యని ఎవరునుచెప్పరు. మిధ్యని గుర్తెరిగెడు వారందరు ఎప్పటికుండెడువారని మిధ్యలో మోక్షము కోరెడు వారెప్పుడు చెప్పరు. అట్లే జనులందరకును మిధ్యలో పుట్టిన కార్యము తీరిన తరువాతను మరిపుట్టరు వారని చెప్పక మానరు. గనుక కదిలేర్పడు శబ్దబ్రహ్మముచే కదిలెడు తన్మాత్రల సామర్ధ్యముగల సృష్ఠంతయు చలనములేన చలబ్రహ్మమునందున మిధ్యందురు లేకదానందున లేదందురుగాని మిధ్యలో కల్పితమగు జగదాకారమునను పుట్టిపెరిగి నశించెడువారిలో జ్ఞానులు మోక్షము కోరెడు వారందరు మిధ్యని ఎప్పుడు చెప్పరు. మిధ్యని చెప్పినచో ప్రత్యక్ష విరోధము ఎవరును పాటించరు. గుణములయందేర్పడు సృష్ఠికి జ్ఞానము సాక్షియై యుండగా శాశ్వతమైయుండగా శాశ్వత జ్ఞానము నిడువని జగమును మిధ్యనుట అనుభవవిరోధము. ఉపాధినిడువక తెలిసెడు జ్ఞానము సృష్ఠికి అతీతమెట్లగును ? ఇక ప్రకాశము సత్యముగలది సూర్యుడు అసత్యమన నొప్పెదరా ? ఇక పరమాత్ముని ఎరిగిన జ్ఞానులు సాధించెరిగెన ప్రత్యక్షము మరి ఏమైననుగలదా ! ఇందుకు జనులందరువిని జూచేరిగెడు ఆత్మొకటని తెలసి ఆనందించెడు మార్గము కలదా ! ఇందుకు పర మాత్మను నిర్గుణమన్నను సగుణమన్నను, ప్రత్యక్షముగను, జూచితిమన్నను, బ్రహ్మమునేనన్నను, భక్తుడనన్నను, శ్రమగలసాధనచే బహురూపములను చూచితిన్ననను, ఆత్మందున జగమంతయు ఆధ్యారోపము అన్నను ఈ విధమున పలికెడు మనసే జీవిత మంతయు సాధించిన ఈ మనసుకు మరిజన్మముగలదని సంశ

యమును తొలగినదనుటకు ప్రత్యక్షముగను జనులందరు జూచె రిగెడు మార్పేమిటి గనవచ్చెను ? ఇక పుట్టేజన్మము ఇక పుట్టని జన్మము ఈ రెండెరిగెడు మార్పేమైనను గలదా ! యని జీవిత మందున సంశయముండక మానదుగదా !

ఇందుకు వెనుకటి జన్మనుగల భాషాజ్ఞానముచే జీవించిన సంసారము మంచెరుగక పుట్టెడు సృష్టి స్వభావము జనులందరి కొకటైయుండగ, ఇక గురువులు శిష్యులు మరణించిన తరువాతను పుట్టెరిగించెడు మార్పేమైననుగలదా ! లేక జనులందరివలె వెనుకటి జన్మము ఎరుగక పుట్టెదరా ? ఇక పుట్టెరుగని వారినిగని మావారే పుట్టిరి వీరని అనుకొనుటకు తగు దృష్టాంతము ఏమిటి ? ఇక జన్మ ముగలదని బాధించెడు సంశయమునబడి వాధించెడు వారితో తేలెడు విశేషమేమిటి ? విషమేవిధమున తిన్నను మరణముతప్ప దుగదా ! ఒకరిని ఒకరెరుగక కార్యము తీరిన తరువాతను ఒకరిని ఒకరిడచి పోకను తప్పదు. ఇక గిట్టి పుట్టెదమను అనుమానముచే జేసెడుకర్మలచే బహుగతులను కలిపించెడు నానాగురువులదరి గుట్టలుగను పెట్టిన గ్రంథములను చదివినిపించినను, విన్నను పుట్టిన వారెన్నడు తమ వెనుకటి పుట్టుగ తామెరుగుట కల్ల ఇక మరణము తరువాతను వెనుకటి సంసారము, వెనుకటికర్మమునను పుట్టితినని ఎరిగెడు జ్ఞానము జగములో ఎరుగుటకల్ల ఇక యోగై పుట్టినను, నక్కై పుట్టినను తనజీవిత మందున రాగలమార్పెప్పుడు ఏనరుతెరుగరు. మరణము తరువాతను ఎరుగక పుట్టిన వాడేమెరు గును ? సమిష్టి నెరుగని నానాగురువుల బోధలచే జనులం దరు ఎరిగిన విశేషమేమిటి ? ఇక అహింసా భోజనమును పాటింతురు కొందరు. హింసాభోజనమును పాటింతురు మరి కొందరు. ఇట్లుండెడు వారిలో వారివారికి తగినట్లుండిన ఆచారము

గల జనులందున సమిష్టిబోజనమును పాటించరు. ఇతరులు తమ వలెనుండుట సహించరు. జనులను నీచులుగను అజ్ఞానులుగను భావించెడు ఈ స్వార్థము ఏ పదార్థము తినినందున గలిగినదో జ్ఞానులు ఎరిగిడవరు. స్వార్థముచేజీవించెడు బ్రహ్మవేత్తలు పుట్టుగ తప్పెడు కార్యము జేసెరిగించిన ప్రత్యక్షముగలదా ! జనులందరు ఎరిగితిరా ! ఇక మాయకల్పిత ఈశ్వర సృష్ఠిలో పుట్టేదానిని తప్పించుట ఏ గురువులు సాధించెరుగరు. ఇక పుట్టని దానిని పుట్టించుట గురువులు ఏనాడును గనుగొనజాలరు. ఈ సంశయ ములను లేకుండగ జేసినవాడే సద్గురుడు. పరిపూర్ణుడు. అచలుడు.

ఈశ్వర ఆశ్రయ త్రిగుణ మాయాప్రకృతి ఆకారముచే సృష్ఠించిన సృష్ఠికివేరై సృష్ఠిసితి లయకర్తగు చైతన్య బ్రహ్మమె సృష్ఠికి బాహ్యాంతర మందున వ్యక్తముగాకుండిన బ్రహ్మమునను తత్వజ్ఞుల ఊహకు గోచరమైయుండును. కారణ కార్యముతానై కలిగిన బ్రిమలో కల్పితమగు సృష్ఠందున పుట్టిన కారణమగు తలిదండ్రుల కార్యములో పుట్టగపడు పుత్రులు కందరకును వ్యక్త ముగానాత్మయు, తెలివియు, జ్ఞానము మనసును గనపడకుండగ జేనగపడు తనువులుగల తలిదండ్రులచే కనిపెంచిన సంతానము లకు తలిదండ్రిలు వేరుగనుండగ పడునట్లుగ, జడచే తనప్రాణు లకెల్లను సాక్షగు మాయిడువని పరమాత్మనిగని ఆనందింతురు పెద్దలు. ఇక ఇట్లుండెడు పెద్దలచే చేసెడుగురు పూజలలో అద్వ ఙుల అనుమతి లేకను మధ్యనకొందరు బోధించెడు పెద్దల పలు కులువిని ఆనందించెడు జనులకు కలుగని సందేహము తనఒకనికి కలిగినదని అడుగుటకారంబించును. పదుగురు ఒకటై అల్లరి చేతురు. ఇట్లెన్నడు కాకుండుటకై తగు న్యాయమును గను గొందురుగాక. [సంపూర్ణము]

ఈ గ్రంథము వలయువారు :

శ్రీ గురుకరుణానంద

గుండా ఈశ్వరయ్య,

2-2-7, పాంజా బజార్, సికింద్రాబాదు-3.

మరియు

జొన్నాడ బ్రదర్సు,

1708, పొగాకు బజార్, సికింద్రాబాదు.

Printed at Premier Press, Secunderabad.

Phone 74306.